


రుచిగా
చల్లగా
తియ్యగా వుండే

పార్లే

ఎక్స్‌ట్రా-స్ట్రాంగ్
పెప్పరమింట్లు

9 పెప్పరమింట్లు ఉండే ప్యాకెట్
ఎంతో తక్కువ ధరకు లభిస్తాయి
మాధుర్యమైన, ఆహ్లాదమునకు
ఆహ్లాదకరమైన మాధుర్యమునకు








everest/981/PP tel

# చందమామ

జూలై 1971

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



వెన్నెలలాంటి వలపు... వలపు తలపులాంటి సంగీతం.... సంగీతంలా సాగిపోయే తీయని కథ!




అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స్

# అమాయకురాలు



నిర్మాత: D. మధుసూదనరావు B.A.,  దర్శకుడు: V. మధుసూదనరావు  అన్నపూర్ణ ఫిలిమ్సు రిలీజ్

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

లోకంలో కొందరు ధనికులుంటారు, కొందరు పేదలుంటారు; కొందరు గొప్ప వాళ్ళుంటారు, కొందరు అనామకు లుంటారు. కాని స్వభావాలనుబట్టి మనుషులను మంచివాళ్ళుగానూ, చెడ్డ వాళ్ళుగానూ విభజించవచ్చు. మంచి వాడి వల్ల పదిమందికి మేలూ, చెడ్డ వాడి వల్ల పదిమందికి కీడూ జరుగు తుంది. ''మంచితనం'' అన్న కథలో చెడ్డవాడు తనకు తానే ఏ విధంగా కీడు తెచ్చిపెట్టుకున్నదీ మనం తెలుసుకుంటాం.

సంపుటి 49 జూలై '71 సంచిక 1

CHITRA




యథా కందుకపాతే నో త్పత త్యార్యః పత న్నపి,
తథా త్వనార్యః పతతి మృత్పిండపతనం యథా—1

[బుద్ధిమంతుడు పతనమైనప్పటికీ బంతిలాగా తిరిగి పైకి ఎగురుతాడు. అదే బుద్ధి హీనుడు పతనమైతే మట్టిముద్దలాగా పడిన చోటనే ఉండి పోతాడు.]

గజ, భుజంగ, విహంగమ బంధనం,
శశి, దివాకర యోర్గ్రహపీడనం,
మతిమతాం చ విలోక్య దరిద్రతాం,
విధి రహో బలవా నితి మే మతిః—2

[ఏనుగులూ, పాములూ, పక్షులూ పట్టుపడటమూ, సూర్యచంద్రులకు గ్రహణాలు కలగటమూ, బుద్ధిమంతులకు దారిద్ర్యం చుట్టుకోవటమూ చూస్తే విధి ఎంత బలమైనదా అనిపిస్తుంది.]

సృజతి తావ దశేషగుణాకరం
పురుషరత్న మలంకరణం భువః,
తదపి తత్క్షణ భంగి కరోతి చే
దహహ కష్ట మపండితతా విధేః—3

[విధి భూమికి అలంకార మనదగిన పురుషశ్రేష్ఠుణ్ణి సృష్టించి, క్షణంలో చంపేస్తుంది. అలాటి విధి ఎంత బుద్ధిలేనిది!]

విధి



# లక్ష్మివిజయం

ఒక నగరంలో విష్ణుభక్తుడుగా ప్రసిద్ధి కెక్కిన వైశ్యోత్తముడు ఒకడు ఉన్నాడు. విష్ణుమూర్తికి, తానే సృష్టి కంతకూ పాలకుడ నని చాలా అహంకారంగా ఉండేది. ఆయన ఒకసారి, తన భార్య అయిన లక్ష్మీదేవితో, "దేవీ, లోకాలన్నీ నా అధీనంలోనే ఉన్నాయి, ప్రాణికోటి అంతా నా పైనే ఆధారపడి ఉన్నది. నా భక్తులైనవారు నీ మాయాజాలంలో ఎన్నటికీ పడరు," అన్నాడు.

దానికి లక్ష్మి, "స్వామీ, అదంతా మీ భ్రమ. సమస్త సృష్టికి అధికారిణిని నేను. నేను కటాక్షించిన వ్యక్తి ఎవడైనా సరే అగ్రగణ్యు డవుతాడు. వాణ్ణి అందరూ గౌర వించి, పూజిస్తారు. నా మాటలో మీకు నమ్మకం లేకపోతే మన శక్తులను పరీ క్షింతాం," అన్నది.

విష్ణువు అందుకు సమ్మతించాడు. ఇద్దరూ యోగినీ, యోగుల రూపాలు ధరించి బయలుదేరారు.

కుంభపోతగా వర్షం కురుస్తూ, వడగళ్ళు పడుతూ, చలి జాస్తిగా ఉన్న సమయంలో యోగి రూపంలో వున్న విష్ణువు ఆ వైశ్య భక్తుడి ఇంటి ముందు, చలికి వణుకుతూ తచ్చాడసాగాడు.

ఇంటిలో నుంచి, విష్ణుభక్తుడైన సెట్టి యోగిని చూసి, ఎంతో ఆదరంతో లోపలికి ఆహ్వానించి, "స్వామీ, ఇది మీ ఇల్లే అను కోండి. ఇల్లంతా చూసి, మీకు నచ్చిన గదిలో విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

యోగి ఇల్లంతా తిరిగి చూసి, ఒక చిన్న కొట్టు దగ్గర ఆగి, "నా కీ గది బాగున్నది. ఇందులో ఉంటాను," అన్నాడు.

"స్వామీ, ఇది మీ రుండటానికి తగదు. ఇందులో పనికిమాలిన సామాను మాత్రమే ఉంచుతాం. మీరు ఇంతకన్న మంచి గది

పి. గురునాథశర్మ



ఏదన్నా ఎన్నుకుంటే బాగుంటుంది," అన్నాడు సెట్టి.

"సెట్టీ, మేము యోగులం. మాకు కావలసింది ఏకాంత స్థలం," అన్నాడు యోగి.

చేసేది లేక సెట్టి ఆ గదిని అప్పుడే శుభ్రం చేయించి, యోగికి అందులో పక్క పరిపించాడు. యోగి ఆ కొట్టులో ప్రవేశించి, తలుపు మూసి గడియ వేసుకున్నాడు. ఆయన తనలో, "నాకు నా భక్తుడు ఆశ్రయమిచ్చాడు. కాని ఈ చలిలో లక్ష్మి ఏమవుతుంది? ఆమెకు ఎవరు ఆశ్రయమిస్తారు? ఆమె తప్పక ఓడిపోతుంది," అనుకున్నాడు.

ఇంతలోనే యోగిని వేషంలో ఉన్న లక్ష్మి కూడా ఆ సెట్టి ఇంటి ముందుకే వచ్చి, చలికి వణుకుతూ తారట్లాడసాగింది. సెట్టి ఆమెను చూసి, ఆమె అందానికి ఆశ్చర్యపడి, బయటికి వచ్చి, "దేవీ, ఇలాటి వాతావరణంలో నువు బయట ఎందుకు ఉన్నావు? చలి అంతకంతకూ ముదురుతున్నది. నీకు అభ్యంతరం లేకపోతే మా ఇంట్లోకి వచ్చి, విశ్రాంతి తీసుకో," అన్నాడు.

యోగిని లోపలికి వచ్చి, "నాకు చాలా దాహంగా ఉన్నది," అన్నది.

సెట్టి తన నౌకరును ఒకణ్ణి పిలిచి, మంచినీరు తెమ్మన్నాడు. నౌకరు తాగేనీరు తీసుకురాగానే యోగిని తన జోలెలో నుంచి ఒక బంగారు లోటా తీసి, అందులో నీరు పోయించుకుని తాగింది. ఆ లోటాకు రత్నాలు తాపడం చేసి ఉండటం సెట్టి గమనించాడు.

యోగిని నీరు తాగేసి, రత్నాలు పొదిగి ఉన్న బంగారు లోటాను దూరంగా పారేసింది. సెట్టి దిగ్భ్రమ చెంది, "దేవీ, అంత విలువైన లోటాను ఎందుకలా పారేశావు?" అని అడిగాడు.

యోగిని, "ఇలాంటి లోటా నుంచి నేను ఒక్కసారి మించి తాగను, అవతల పారేస్తాను. నా కింకా మంచినీరు కావాలి,"

అన్నది. ఆమె అలా అయిదారుసార్లు నీరు తెప్పించుకుని, ప్రతిసారీ జోలె నుంచి రత్న ఖచితమైన లోటా ఒకటి తీసి, అందులో నీరు పోయించుకుని తాగి, లోటాలను దూరంగా పారేసింది.

ఇది చూసిన సెట్టి ఆశ్చర్యానికి అంతు లేదు. ఆయన భార్య కొంతకాలం క్రితం పోయింది. ఈ యోగిని తనకు భార్య కావటానికీ, తన ఇంట వుండిపోవటానికీ ఒప్పుకుంటే, తనకు మరి కావలసినదేమీ ఉండదనుకుని అతను, "దేవీ, నీ బట్టలు వర్షానికి తడిసి ముద్ద అయిపోయాయి. వాటిని మార్చుకుని, భోజనం చేసి, విశ్రాంతి తీసుకో. ఈ విశాలభవనంలో నీ కిష్టమైన గదిలో నువు ఉండవచ్చు," అన్నాడు.

సెట్టి వెంట యోగిని ఇల్లంతా తిరిగి చూసి, యోగి తీసుకున్న గది వద్దకు వచ్చి, "నా కీ గది కావాలి," అన్నది.

"దేవీ, ఈ గది నీకు ఎంతమాత్రమూ అనుకూలంగా ఉండదు. అదీగాక, ఈ గదిలో అదివరకే ఒక యోగి చేరాడు. అందుచేత మరొక మంచి గది ఏదన్నా కోరుకో!" అన్నాడు సెట్టి.

తనకు ఆ గదే కావాలని యోగిని పట్టుబట్టింది. చేసేది లేక, సెట్టి తలుపు తట్టి, "స్వామీ, మీరు ఈ గది ఖాళీచేసి, మరో గదిలో విశ్రమించండి," అని కేక పెట్టాడు.

"నేనిప్పుడు యోగసమాధిలో ఉన్నాను. కదలటానికి వీల్లేదు. నేను ఈ గదిలోనే ఉంటాను," అన్నాడు యోగి లోపలినుంచి.





సెట్టి యోగినిని మరొక గది తీసుకోమని మరొకసారి ప్రార్థించాడు. కాని ఆమె అందుకు ఒప్పుకోలేదు. అందు చేత సెట్టి తిరిగి గది తలుపు తట్టి, మరొక గది తీసుకో మని యోగిని మళ్ళీ కోరాడు. అందుకు యోగి ఒప్పుకోలేదు. చివరకు సెట్టి, కోపం వచ్చి తన నౌకర్లను పిలిచి, తలుపు పగల గొట్టించి, "ఈ మొండి యోగిని బయటికి గెంటండి," అని ఆజ్ఞాపించాడు.

సెట్టి నౌకర్లు యోగిని బలాత్కారంగా లేవదీసి బయిటికి తీసుకుపోతూంటే చూసి యోగిని విరగబడి నవ్వింది. ఆమె ఆ గది లోకి అడుగు పెట్టి, సెట్టితో, "మా కోసం నువు నీ స్వహస్తాలతో భోజనం చేసి పట్టు కురా!" అన్నది. సెట్టి వంట ఇంటికి వెళ్ళి యోగిని కోసం వంట ప్రారంభించాడు.

సెట్టి అలా వెళ్ళగానే యోగిని గబగబా బయటికి వచ్చేసి, యోగిని కలుసుకొని, "స్వామీ, ఏం జరిగిందో చూశారుగా? మీ భక్తుడు ఏం చేశాడు? ప్రపంచం మీద ఆధిపత్యం నాది కాదంటారా?" అన్నది.

విష్ణువు ఏమీ జవాబు చెప్పలేదు.

అప్పటికి చాలా పొద్దుపోయింది. వాళ్ళి ద్దరూ అలా ఒక దేవాలయాన్ని చేరుకు న్నారు. అది విష్ణ్వాలయం. దాన్ని రాజుగారు కట్టించాడు. ఆ ఆలయాన్ని నియమిత కాలాలలో మూసి, తెరుస్తూ ఉంటారు.

ఆ ఆలయాన్ని చూడగానే విష్ణువు, "ఇక్కడ లక్ష్మి పప్పు ఉడకదు," అని సంతోష పడ్డాడు. ఎందుకంటే, ఆ దేశపు రాజేగాక, ప్రజలందరూ కూడా విష్ణుభక్తులు. అంతే గాక వారెవరూ లక్ష్మిని పూజించరు. అందుచేత ఆయన లక్ష్మితో, "దేవీ, మనం ఇక్కడ కొద్ది రోజులు ఉండిపోతే ఎలా ఉంటుందంటావు?" అన్నాడు.

"స్వామీ, నేను మీ దాసిని. మీ యిష్టమే నా యిష్టం. కాని ఇక్కడ అయినా మీకు విజయం లభిస్తుందనుకోకండి. ఎక్కడైనా నేనే జయిస్తాను," అన్నది లక్ష్మి.

ఇద్దరూ ఆ దేవాలయం ప్రవేశించి, అక్కడ విశ్రమించారు.

మర్నాడు తెల్లవారు ఝామున నాలుగు గంటలకు అర్చకుడు వచ్చి, పూజ ప్రారంభించాడు. భక్తులు దేవుడి దర్శనం కోసం రాసాగారు. వచ్చిన భక్తులందరూ విష్ణు స్తోత్రాలు చేశారు. లక్ష్మి పేరు స్మరించిన వాడు ఒక్కడూ లేడు. విష్ణువు మనసు ఆనందంతో విప్పారింది.

సరిగా మిట్ట మధ్యాన్నం కాగానే దేవాలయాన్ని పూజారి మూసేశాడు.

"చూశావా, దేవీ? నిన్ను స్మరించిన భక్తుడే లేడు. ప్రపంచంలో నాదే ఆధిపత్యమని ఒప్పుకుంటావా?" అని విష్ణువు లక్ష్మిని అడిగాడు.

లక్ష్మి చిరునవ్వు నవ్వి, "భక్తులకు ఇంతసేపూ దర్శనం ఇచ్చి అలసిపోయి ఉంటారు. మీరు కాస్సేపు విశ్రాంతి తీసుకోండి," అన్నది.

అకస్మాత్తుగా ఆ సమయంలో రాజుగారికి పూజారిని పరీక్షించాలని బుద్ధి పుట్టింది. ఆయన ఒక వ్యాపారస్థుడి వేషంధరించి దేవాలయానికి వచ్చి, పూజారితో, "నాకు భగవంతుడి దర్శనం ఇప్పించు," అన్నాడు.

"అయ్యా, ఆలయం తలుపులు మధ్యాన్నం పన్నెండు దాటి తెరిచి ఉంచరాదని రాజాజ్ఞ. మీకు దేవదర్శనం ఇక సాయంకాలానికే," అన్నాడు పూజారి వ్యాపారస్థుడితో.




"దానిదేముందిలే, బాబూ. దర్శనం ఇప్పించు. నేను మరో దేశంనుంచి వచ్చిన వాణ్ణి. భగవంతుడి దర్శనం చేసుకుని, వెయ్యి రూకలు కానుక ఇచ్చుకుందామని వచ్చాను. నేను వెంటనే మా వూరికి వెళ్ళిపోవాలి. అందుచేత నాకు దర్శనం ఇప్పించివుంటే నేను కృతార్థుణ్ణి అయేవాణ్ణి; భగవంతుడికి కానుక సమర్పించిన పుణ్యమూ నాకు దక్కేది. నేను మళ్ళీ ఈ నగరానికి ఎప్పుడు వస్తానో, ఏమో!" అన్నాడు వ్యాపారస్థుడు, వెళ్ళిపోబోతూ.

కోరివచ్చే లక్ష్మిని ఎందుకు అడ్డగించాలని పూజారికి అనిపించింది. ఆ మనిషికి దర్శనం యిప్పిస్తే తనకు వచ్చేనష్టమేమిటి?

రాజుగారికి ఈ సంగతి తెలిసి నప్పటి మాటగద!

ఇలా అనుకుని పూజారి వెళ్ళిపోతున్న వ్యాపారస్థుడితో, "అయ్యా, ఆగండి. మీరు నిరాశపడి వెళ్ళవద్దు. భగవంతుడి దర్శనం చేసుకుని, ప్రసాదం పుచ్చుకుని మరీ వెళ్ళండి," అన్నాడు.

వ్యాపారస్థుడు భగవంతుడికి రెండువేల రూకలు కానుక అర్పించి, దర్శనం చేసుకుని, ప్రసాదం పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

ఆయన రాజభవనం చేరుతూనే పూజారిని పిలిపించి, "పూజారీ, ఆలయంలో పూజా పునస్కారాలు సక్రమంగా సాగుతున్నాయా?" అని అడిగాడు.

"జరుగుతున్నాయి, మహారాజా!" అన్నాడు పూజారి.

"ఆలయం తలుపులు తీయటమూ, మూయటమూ సకాలంలో జరుగుతున్నదా? ఏ ధనికుడైనా దేవదర్శనం కోసం వస్తే వేళగాని వేళ తలుపులు తెరవటం లేదు గద?" అన్నాడు రాజు.

తన మీద రాజుగారి కెవరో ఫిర్యాదు చేశారని పూజారికి అనుమానం కలిగింది. అతను యుక్తిగా, "మహారాజా, దేవాలయం తలుపులు వేళ ప్రకారమే మూస్తున్నాను, తెరుస్తున్నాను. తమరు తమ మందిరంలో నిద్రపోయే సమయంలో మహారాణి వారు వేంచేసినట్టయితే తమ మందిరం తలుపులు తెరవక తప్పదు గద! అలాగే విష్ణు మందిరంలోకి లక్ష్మీదేవే వస్తానంటే తలుపులు తెరవక తప్పదు మరి!" అన్నాడు.

పూజారి యుక్తిగా అన్న ఈ మాటకు సంతోషించి, మరి రెండు వేలు ఇచ్చి పంపేశాడు రాజు.

విష్ణువు మరోసారి ఓడిపోయాడు. అప్పుడు లక్ష్మి ఆయనతో, "స్వామీ, మీరు నా వాస్తవ రూపం తెలుసుకో లేదు. సృష్ట్యాది నుంచీ నాకు ప్రాధాన్యత ఉన్నది. కనిపించేదంతా నా రూపమే. పురుషుడిలో ఉండే శక్తి అంతా స్త్రీదే. మీలో ఉన్నశక్తి అంతా నాదే. త్రిమూర్తులకూ నేనే ఆధారం. అందుచేత నన్ను మీరు జయించలేరు," అన్నది.





# 10

[భైరవులకు చిక్కి ప్రాణాపాయస్థితిలో వున్న జీవదత్తుణ్ణీ, భవానినీ గ్రామస్థుల సాయంతో ఖడ్గవర్మ కాపాడాడు. భైరవులు అరణ్యంలోకి పారిపోయారు. గ్రామస్థులకు వీడ్కోలు చెప్పి, జీవదత్తుడూ, ఖడ్గవర్మా కొండ కింది లోయలోకి వెళ్ళారు. అక్కడ వాళ్ళకు యువకు డొకడు కనిపించాడు. ఖడ్గ జీవదత్తులు అతణ్ణి చుట్టుముట్టారు. తరవాత—]

ఖడ్గవర్మ కత్తి పైకెత్తి యువకుడి గుండెలకేసి గురిచేసి, నిలబడ్డాడు. జీవదత్తుడు కూడా దండాన్ని ఎత్తి పట్టుకుని కొంచెంసేపు ఆగి, యువకుడిలో ఎలాంటి చలనం లేకపోవటం చూసి, "ఏం, భయపడుతున్నావా? అంత భయస్థుడికి అంత పదునైన గండ్రగొడ్డలి ఎందుకు?" అన్నాడు హేళనచేస్తున్నట్టు.

ఆ మాటలకు యువకుడి ముఖం కోపంతో ఎర్రబడింది. అతడు పళ్ళు కొరుకుతూ అటూఇటూ తల తిప్పి, ఖడ్గ జీవదత్తుల్ని ఓమారు చూసి, "మీరు నా మీదికి దొంగచాటుగా వచ్చి పడ్డారు. అయినా నేను భయపడటం లేదు. ముందు మీలో ఎవర్ని యమలోకానికి పంపటమా అని ఆలోచిస్తున్నాను." అన్నాడు.

"అట్టే ప్రగల్భాలు పలకకు. ఈ నట్టడవిలో యీ చెట్టుకు ఎందుకు కాపలా కాస్తున్నావో చెప్పు!" అంటూ ఖడ్గవర్మ




చప్పున ముందుకు ఒకడుగు వేసి, యువకుడి కంఠాన్ని నరకబోయేవాడిలా కత్తిని ఝుళిపించాడు.

ఖడ్గవర్మ ఎత్తు పారింది. యువకుడు గండ్రగొడ్డలిని ఎత్తి అతడి కేసి దూకబోయాడు. అదే అదనుగా జీవదత్తుడు ముందుకు పోయి దండాన్ని అతడి మోకాలికి అడ్డం పెట్టి వెనక్కు గుంజాడు. యువకుడు దభీమంటూ ముందుకు పడిపోయాడు. అతడి చేతిలోని గండ్రగొడ్డలి పట్టుతప్పి దూరంగా పోయిపడింది.

ఖడ్గవర్మ నవ్వుతూ గొడ్డలిని తీసుకుని భుజానికి తగిలించుకుని, "ఇప్పుడు మనం చేసింది ఎవరికీ ప్రాణాపాయం కలగని యుద్ధం. ఓపిక వుంటే లేచి నిలబడు, లేకపోతే ఆ చెట్టుబోదెకు చేరగిలబడి కూర్చో. అసలు సంగతి చెప్పు. బావగారెవరు? చెట్టు, కోటబురుజు కాపటం ఏమిటి?" అని అడిగాడు.

"ప్రస్తుతానికి మీరే గెలిచారు. కాని ఆ రహస్యం తెలుసుకోవటంవల్ల మీకు మేలుకన్న కీడే ఎక్కువ కలుగుతుంది. ఆ మధ్య ఒకడికి చెప్పాను. వాడు బావగారి పెంపుడు సింహాలకూ, పులులకూ మేత అయిపోయాడు," అన్నాడు యువకుడు.

"ఓహో, యిది మరీ చిత్రంగా వుంది! ఆ రహస్యం మేం తప్పక తెలుసుకోవాలి. త్వరగా చెప్పు. చీకటి పడేలోపల మేం ఆ ఎదురుగా వున్న కొండ దిగి పోవాలి." అన్నాడు జీవదత్తుడు.

"ఆ రహస్యం నేను చెపితే మీరు ఆ కొండా యీ కొండా మధ్యవున్న చిన్న మైదానంలో ఘోరమరణం పాలవుతారు." అన్నాడు యువకుడు.

ఖడ్గవర్మ కోపంగా గండ్రగొడ్డలిని తీసుకుని యువకుడితో, "తల నరకమంటావా? ఆ సంగతేదో చెపుతావా?" అన్నాడు.

యువకుడు ఖడ్గవర్మ ముఖంలోకి ఓసారి పరీక్షగా చూసి, అతడు అన్నంత పనీ చేస్తాడని, భయపడిపోయి, "అయితే వినండి! ఈ చెట్టు బోదె పైకి అయిదారడుగులు




ఎక్కితే అక్కడ మీకొక తొర్ర కనబడు తుంది. ఆ తొర్రలో కొద్ది దూరం పాకుతూ పోయారంటే, ఒక సొరంగ మార్గం ఎదు రవుతుంది. దాని వెంట పోతే అవతలి కొండను ఓ అరగంటలో సునాయాసంగా చేరవచ్చు. కాని దారిలో మీకు బావగారి మిట్టకోట తగులుతుంది. అక్కడ తప్పక మీకు నూకలు చెల్లిపోతాయి.'' అన్నాడు.

జీవదత్తుడు ఓ క్షణకాలం ఆలోచించి యువకుడి మాటల సారాంశం అర్థం చేసు కుని, ''అంటే, యీ చెట్టు బోదెలోని రహస్య మార్గంకుండా మీ బావగారి కోటను ఎవడూ చేరకుండా యిక్కడ ఆ బురుజుల దగ్గర కాపలా కాస్తున్నావన్న మాట! ఆ ఎదురుగా వున్న కొండను చేరేందుకు నువ్వు చెప్పేది దగ్గిర దారిలా కనబడు తున్నది గనక, యీ మార్గానే పోతాం. దారి అడ్డగిస్తే మీ బావగారి సంగతి తేల్చుతాం!'' అన్నాడు.

''అదేదో నేను రాత్రికి వచ్చి చూస్తాను. ఆయన కంటపడి సూర్యాస్తమయం వరకూ బతికుంటే మీ రిద్దరూ మహా వీరుల కిందే లెక్క!'' అన్నాడు యువకుడు.

ఖడ్గ జీవదత్తులు అతడి మాటలకు నవ్వు కుని చెట్టు ఎక్కారు. యువకుడు చెప్పి నట్టే వాళ్ళకు చెట్టు బోదెలో ఒక పెద్ద తొర్ర కనిపించింది. ముందు జీవదత్తుడు దానిలో ప్రవేశించి బోర్లా పడుకుని ముందుకు పాక సాగాడు. ఖడ్గవర్మ తాను కూడా తొర్రలోకి వెళ్ళే ముందు యువకుడికి అతడి గండ్ర గొడ్డలిని యిచ్చివేస్తూ, ''నువ్వు చీకటి పడే లోపలే మీ బావగారి సంస్థానానికి రావటం మంచిది. బహుశా నువ్వు వచ్చేసరికి, ఆయన మిట్టకోట నేల మట్టం అయి వుంటుంది.'' అన్నాడు.

యువకుడు ఏదో అన్నాడుగాని తొర్ర వెంట ముందుకు పాకి పోతున్న ఖడ్గ జీవ దత్తులకు ఆ మాటలు వినిపించ లేదు. వాళ్ళు ఓ పది నిమిషాల కాలం అలా పోయింతరవాత వాళ్ళ దారిని అడ్డగిస్తూ ఒక బండరాయి—నాలుగు పలకలుగా వున్నది



ఎదురైంది. మసక చీకట్లో జీవదత్తుడు దాన్ని తడివి చూశాడు. రాతి మధ్య అతడికి ఒక మేకు లాంటిది తగిలింది. అతడు దాన్ని రెండు చేతులతో గట్టిగా పట్టుకుని వెనక్కు లాగాడు. రాయి వూడి వచ్చింది. వాళ్ళకు ఎదురుగా సొరంగ మార్గం కనిపించింది.

"ఖడ్గా, ఇక మనం యీ సొరంగ మార్గం వెంట వంగి నడిచి పోవచ్చులా వుంది. ఎందుకైనా మంచిది, ఆయుధాలు సిద్ధంగా వుంచుకుని, నా వెనక జాగ్రత్తగా నడువు," అంటూ జీవదత్తుడు లేచి నిలబడి సొరంగంలో ప్రవేశించాడు.

సొరంగ మార్గం అంత చీకటిగా లేదు. అందుక్కారణం అవతలి వైపు ద్వారానికి ఏ రాళ్ళలాటివో అడ్డం లేకపోవటమే. ఖడ్గ జీవదత్తులు కొద్ది సేపటికల్లా సొరంగం అవతలి వైపుకు చేరారు. ఎదురుగా వాళ్ళకు చిన్న మైదాన ప్రదేశంలాంటిది కనిపించింది. అక్కడ అంతగా చెట్లు లేవు. సొరంగ ద్వారానికి కొద్ది దూరంలో ఒక చుట్టు గుడిసె లాటిది వున్నది. దానికి కొంచెం ఎడంగా కొన్ని కట్టడాలు—పశువుల కొట్టాలలాటివి వున్నవి. వాటిని ఆనుకుని ఒక ఎత్తయిన రాళ్ళగుట్ట. దానిమీద పెద్ద రాళ్ళతో కట్టిన ఒక పెద్ద భవంతి వాళ్ళకు కనిపించినై.

"ఇదా ఆ కుర్రవెధవ చెప్పిన బావగారి మిట్టకోట! ఇతడు లోయ మధ్య నివసిస్తున్న తీరూ, గుట్టమీది రాతికట్టడం చూస్తూంటే—వీడు ఏదో రాక్షసుడై వుంటాడని నాకు అనుమానం కలుగుతున్నది!" అన్నాడు జీవదత్తుడు.

"రాక్షసుడే కావచ్చు! అయినా మనం యింత దూరం వచ్చి వెనక్కు తిరిగి పోబోవటం లేదుకదా?" అన్నాడు ఖడ్గవర్మ.

"అదెలా కుదురుతుంది? మనం పొద్దుటి నుంచి దాదాపు ఉపవాసం చేస్తున్నాం. అదుగో సూర్యుడు అస్తమించటానికి మరెంతో కాలం లేదు. మనం యీ రాత్రికి బలప్రయోగం చేసి అయినా, యీ మిట్ట కోట రాజావారికి అతిథులుగా వుండక తప్పదు!" అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

ఆ తరవాత ఇద్దరూ దాపులనున్న చుట్టు గుడిసె కేసి బయలుదేరారు. అందులో కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని మిట్ట మీద వున్న భవనానికి పోవాలని వాళ్ళ ప్రయత్నం.

ఖడ్గ జీవదత్తులు చుట్టు గుడిసెకు యింకా నూరూ నూటయిరవై గజాల దూరంలో వుండగా గుడిసె వైపునుంచి ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. ఆ వెంటనే సింహం గర్జించిన శబ్దం వినవచ్చింది. ఖడ్గ జీవదత్తులు ఓ క్షణకాలం నివ్వెరపోయి, అంతలోనే తేరుకుని ఆ ధ్వని వచ్చిన వైపుకు పరిగెత్తబోయేంతలో, ఒక స్త్రీ గుడిశెలోంచి కేకలు పెడుతూ బయిటికి పరిగెత్తుకు వచ్చింది. ఆమెను వెన్నంటి ఒక సింహం కూడా బయిటికి వచ్చింది.

జీవదత్తుడు, ఖడ్గవర్మను హెచ్చరించి వేగంగా పరిగెత్తిపోయి స్త్రీకి, సింహానికి మధ్య నిలబడ్డాడు. స్త్రీ చిన్నగా ఒక కేక పెట్టి గుట్ట మీది భవంతి కేసి పరిగెత్తుతూ, "సింహానికి హాని కలిగించకండి! మా ఆయన మిమ్మల్ని బతకనివ్వడు!" అంటూ అరిచింది.

ఈ హెచ్చరిక జీవదత్తుణ్ణీ ఖడ్గవర్మనూ చాలా ఆశ్చర్య పరిచింది. సింహం నుంచి ప్రాణం కాపాడుకునేందుకు పరిగెత్తుకుపోయే స్త్రీ యిలా హెచ్చరించటం ఏమిటి? కాని, జీవదత్తుడికి యీ వింత హెచ్చరిక గురించి ఆలోచించే అవకాశం లేదు. సింహం అతడి కేసి ఒకసారి పెద్దగా గర్జించి, మీదికి దూకింది. కాని, జీవదత్తుడు





చప్పున పక్కకు తప్పుకుని. అది తిరిగి తన మీద పడబోయే లోపల దాని వీపు మీదికి ఎగిరి కూర్చున్నాడు.

సింహం చెవులు చిల్లులు పడేలా గర్జిస్తూ, వెనక కాళ్ళ మీద లేచి జీవదత్తుణ్ణి కింద పడవేయాలని చూసింది. తల తిప్పి అతణ్ణి నోట పట్టాలని చూసింది. కాని, జీవదత్తుడు దాని నోటికి అందకుండా, చేతిలోని దండంతో దాని తల మీదా, గవదల మీదా కొట్టసాగాడు. అది మరింతగా అరుస్తూ ఆ మైదాన ప్రదేశాన్నంతా కలయ తొక్కసాగింది.

ఖడ్గవర్మ ఆ దృశ్యం చూసి ఉత్సాహంగా, "జీవా, దాన్ని చంపకు! కొంచెం శిక్షణ యిస్తే దాన్ని మనం అవసరానికి అశ్వంలాగా వాడుకోవచ్చు ననుకుంటాను," అన్నాడు.

సింహం బారినుంచి పారిపోయిన స్త్రీ భవంతి వున్న గుట్టమీదికి కొంత దూరం పోయి అక్కడ నిలబడి, గుట్ట మలుపు కేసి చేయి చూపుతూ, "అడుగో, మా ఆయన వేట నుంచి తిరిగివస్తున్నాడు. మీరు వెంటనే యిక్కణ్ణించి పారిపొండి. మిమ్మల్ని చూశాడో, మీకు చావు తప్పదు!" అని కేక వేసింది.

ఖడ్గవర్మ స్త్రీ చూపిన వైపుకు తలతిప్పి చూశాడు. ఎనిమిదీ తొమ్మిది అడుగుల ఎత్తున్న ఒక మహా కాయుడు, చేతిలో ఒక రాతి గద పట్టుకుని, ఒక లేడినీ, అడవి పందినీ ఒక భుజాన వేసుకుని, రెండవ భుజానికి కుందేళ్ళూ, అడవి పక్షులూ వున్న వల తగిలించుకుని, తమకేసే వస్తున్నాడు. అతడికి ముందూ వెనకా నాలుగైదు సింహాలూ, పెద్ద పులులూ నడుస్తున్నవి. వాటి మెడల్లో వున్న తోలు పట్టెలను పట్టి; అవి ఆ మహాకాయుడు వేటకు ఉపయోగించే పెంపుడు జంతువుల్లా కనబడుతున్నవి.

ఆ మహాకాయుడి దృష్టికి ముందు సింహం మీద కూర్చుని వున్న జీవదత్తుడు కనిపించాడు. అతడికి కలిగిన ఆశ్చర్యం అంతాయింతా కాదు. అంతలో అతడి దృష్టి

కత్తి దూసి తన స్నేహితుడి కేసి వస్తున్న ఖడ్గవర్మ పైన పడింది.

ఆ వెంటనే మహాకాయుడు భుజాన వేలాడుతున్న వేట జంతువుల్ని కింద పడ వేసి, రాతి గదను ఎత్తి పట్టుకుని, ఖడ్గ జీవ దత్తుల కేసి పెద్ద పెద్ద అడుగులు వేసు కుంటూ వస్తూ, "ఎవర్రా మీరు? అల్పాయు ష్కుల్లా వున్నారు! నా పెంపుడు సింహం మీదే స్వారి చేస్తున్నారా?" అన్నాడు ఉరుములాంటి పెద్ద గొంతుతో.

"ఈ సింహాన్నుంచి నీ భార్యను కాపా డాను. నిజమో అబద్ధమో ఆ మిట్ట మీద నిలబడి వున్నది, అడుగు!" అంటూ జీవ దత్తుడు సింహం తలమీద దండంతో బలంగా ఒకసారి మోది, దాని వీపు మీదినుంచి కిందిగి దూకేశాడు.

మహాకాయుడు తన భార్య కేసి చూశాడు. ఆమె గబగబా తన భర్త దగ్గిరకు వచ్చి, జరిగిందంతా చెప్పి, "వీళ్ళిద్దర్నీ ప్రాణాలతో వదులు. వాళ్ళదారిన వాళ్ళు పోతారు!" అన్నది.

"ఎలా వదలటం! వీళ్ళు నా రాజ్యంలో రహస్యంగా ప్రవేశించారు గదా? అక్కడ చెట్టు దగ్గిర కావిలి కాస్తున్న నీ తమ్ముడు- ఆ సోమరి వెధవ ఏం చేస్తున్నట్టు?" అంటూ ఆగి, మహాకాయుడు ఏదో అను మానం వచ్చిన వాడిలా, ఖడ్గ జీవదత్తుల్ని



పరీక్షగా చూస్తూ, "అన్నట్టు మీరు అరణ్యంలో చెట్టు క్కాపలా వున్న నా బావ మరిదిని చంపి, యిక్కడికి రాలేదుగదా?" అని ప్రశ్నించాడు.

"ఆ అవసరం కలగలేదు. తనకైతనే మాకు యిక్కడికి వచ్చే దారి చూపించాడు. గంధ్రగొడ్డల్ని కూడా తిరిగి యిచ్చేశాం," అన్నాడు జీవదత్తుడు.

"సరే, అయితే వచ్చిన దారినే తిరిగి పొండి. మళ్ళీ బతికుండగా ఎన్నడూ యిటు రాకండి. నా భార్య దయాభిక్ష వేడింది కనక మిమ్మల్ని ప్రాణాలతో వదులు తున్నాను," అన్నాడు మహాకాయుడు పళ్ళు కొరుకుతూ.

అతడి యీ మాటలు ఖడ్గవర్మకు ఎక్కడ లేని కోపాన్ని తెప్పించినై. అతడు జీవదత్తుడి కేసి ఓమారు చూసి కత్తి పైకెత్తి, "మాకు ఎవరి దయాభిక్షా అవసరం లేదు. నువ్వు కండకావరంతో వున్నట్టున్నావు. నిన్ను యీ కత్తితో రెండు మూడు నిమిషాల్లో నాలుగైదు ముక్కలుగా నరగ్గలను!" అన్నాడు.

ఖడ్గవర్మ యిలా అనగానే మహాకాయుడు పెద్దగా హుంకరించి గద పైకెత్తి అతడి మీదికి రాబోయాడు. కాని అతడి భార్య గట్టిగా చేయి పట్టుకుని, "ఇది ధర్మయుద్ధం అనిపించుకోదు. వీళ్ళూ మహా శూరుల్లాగే కనబడుతున్నారు. మీ యిద్దరూ గుర్రా లెక్కి యుద్ధం చేయండి. అప్పుడు పరాక్రమం, నేర్పూ వున్నవాళ్ళు జయిస్తారు," అన్నది.

ఆ మాటల్తో మహాకాయుడు కొంచెం స్థిమితపడ్డాడు. అతడు ఖడ్గ జీవదత్తులతో, "నా భార్య చెప్పింది బాగానే వున్నది. ఈ రాత్రికి మీరు నాకు అతిథులుగా వుండండి. సూర్యోదయం కాగానే మీకు నా అశ్వశాలలో నుంచి మీరు కోరిన అశ్వాన్ని యిస్తాను. నేనూ ఒక అశ్వాన్ని తీసుకుంటాను. నా ఆయుధాగారం నుంచి మీరు కోరిన ఆయుధం యిస్తాను. మీలో ఎవరు నాతో మొదటగా పోరాడతారు?" అన్నాడు.

"మొదటగా చివరగా కూడా నీతో నేనే యుద్ధం చేయబోతున్నాను. నాకు అశ్వాన్ని యిస్తేచాలు. ఈ దండమే నా ఆయుధం! నువ్వు నన్ను ఓడిస్తే, నా మిత్రుణ్ణి కూడా ఓడించినట్టే!" అన్నాడు జీవదత్తుడు.

"ఆహాఁ, నీ ధైర్యానికి మెచ్చుకున్నాను. ఇక నా వెంట మిట్టకోటకు రండి!" అన్నాడు మహాకాయుడు.

ఖడ్గ జీవదత్తులు అతడి వెంట గుట్ట మీది భవనానికి బయలుదేరారు. మహాకాయుడు తాను వేటాడి తెచ్చిన జంతువుల్నీ, పక్షుల్నీ భుజాన వేసుకుని, వెంట వున్న పెంపుడు సింహాల్నీ, పులుల్నీ పశుల కొట్టాలలోకి తోలి, కొద్ది సేపటికల్లా మిట్ట మీది భవనాన్ని చేరాడు. —(ఇంకావుంది)





# ముగ్గురు కొడుకులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల నెగ్గు తుందని తోస్తుంది. నీలాగే పూర్వం సింహ కేతుడి కొడుకు విజయుడు తాను పూనిన పని సాధించి రాజ్యం కూడా సంపాదించు కున్నాడు. శ్రమ తెలియకుండా ఉండ గలందులకు నీకు అతని కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం విదేహ అన్న చిన్న రాజ్యాన్ని సింహకేతు డనే రాజు పరిపాలించేవాడు. ఆయనకు ప్రతాపుడూ, ఉల్లాసుడూ, విజ యుడూ అని ముగ్గురు కొడుకులు. తండ్రికి వాళ్ళపైన చాలా ప్రేమ.

సింహకేతుడికి పరిపాలనలో పేనాడూ అసక్తి లేదు. అందుచేత తన కుమాళ్ళు

## బేతాళ కథలు



యుక్తవయస్కులు కాగానే, ఆయన తన పెద్ద కొడుకును ప్రతాపుణ్ణి పిలిచి, "నాయనా, నీకు పట్టాభిషేకం చేస్తాను. ఇకనుంచి ఈ రాజ్య భారాన్ని నువ్వే మొయ్యి," అన్నాడు.

ప్రతాపుడు అందుకు ఒప్పుకోక, "నాన్న గారూ, మీకు రాజ్యపాలన ఇష్టం లేకుంటే, రాజ్యాన్ని మూడు భాగాలు చేసి మా ముగ్గురికీ ఇవ్వండి. అంతేగాని కిరీటం నా నెత్తినే పెట్టవద్దు," అన్నాడు.

అయితే, రాజ్యాన్ని ముక్కలు చెయ్యటానికి నగర పెద్ద లెవరూ ఒప్పుకో లేదు. వారంతా రాజసభ జరిపించి కర్తవ్యం గురించి చర్చించారు. చర్చ కొంతసేపు జరిగిన మీదట పెద్దలలోకెల్లా వృద్ధుడు లేచి, "నేను చెప్పినట్టు చేసినట్టయితే ఈ సమస్య తీరిపోతుంది. ముగ్గురు రాజకుమారులనూ మూడు విలువగల వస్తువులను సాధించుకు రమ్మని దేశాలమీద పంపుదాం. ముగ్గురిలో ఎవరు హెచ్చు విలువగల దాన్ని సాధించుకు వస్తే అతనికే పట్టం కట్టుదాం," అన్నాడు.

ఈ ఆలోచనకు పెద్దలు సమ్మతించారు. రాజకుమారులు కూడా ఈ సూచనను ఆమోదించారు. ఆ రోజే వారు దేశాటనకు బయలుదేరారు.

ఆ రాత్రికి వారు ఒక అరణ్యంలో చిక్కుకుపోయారు. చేసేదిలేక వాళ్ళు ఏ చెట్టు కిందనో ఆకులు పరిచి, పక్కలు తయారు చేసుకుని, వాటిమీద ఆ రాత్రి నిద్ర పోవటానికి సిద్ధపడ్డారు.

ఆ సమయంలో అక్కడికి ఒక ముని వచ్చి, "నాయనలారా, మీ రిక్కడ పడుకోవటం అంత క్షేమం కాదు. దగ్గరలోనే నా కుటీరం ఉన్నది. మీరు అక్కడికి వచ్చి విశ్రమించండి," అన్నాడు.

వాళ్ళు మునీశ్వరుడికి కృతజ్ఞత తెలుపుకుని, ఆయన వెంట ఆయన ఉండే కుటీరానికి వెళ్ళి, అక్కడ ఆయన వారికోసం ఏర్పాటు చేసిన జింకచర్మాల మీద పడుకుని, సుఖంగా నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారి లేచేసరికి, వారికి కుటీరం గోడమీద ముగ్గురు కన్యల చిత్తరువులు కనిపించాయి. ఆ కన్యలు ఎంతో అందంగా ఉన్నారు. అయితే వారు ధరించిన దుస్తులు మాత్రం భేదంగా ఉన్నాయి. ఒకతె ధరించిన దుస్తులు బంగారం రంగులోనూ, రెండవది ధరించినవి వెండి రంగులోనూ, మూడవది ధరించినవి ఇనుము రంగులోనూ ఉన్నాయి. ఆ చిత్తరువులను చూస్తూంటేనే ముగ్గురికీ ముగ్గురు కన్యకల మీదా మోహం పుట్టుకొచ్చింది.

పెద్దవాళ్ళిద్దరూ, తాము కోరిన కన్యలు సప్తసముద్రాల అవతల ఉన్నా సరే వెతికి వెళ్ళాడతామని బయలుదేరటానికి సిద్ధమయారు. కాని మూడోవాడైన విజయుడు, "తొందర దేనికి? ఈ కన్యల జాడ మునీశ్వరుడి ద్వారా తెలుసుకుంటే మన పని మరింత తేలిక అవుతుందిగద!" అని చెప్పి, వారిని వారించాడు.

రాజకుమారుల కన్న ముందే లేచి అరణ్యంలోకి వెళ్ళిపోయిన మునీశ్వరుడు ఝాము పొద్దెక్కి తన పర్ణశాలకు తిరిగి వచ్చాడు. ఆయన వచ్చిన సంగతి కూడా గుర్తించక రాజకుమారులు తాము మోహించిన కన్యల చిత్తరువుల కేసే చూస్తున్నారు.

"తదేకంగా ఆ చిత్తరువులను చూస్తున్నారెందుకు? ఆ కన్యలు లభ్యం అయేవాళ్ళు



కారు. వారి వద్దకు పోవటం అపాయకరం," అన్నాడు మునీశ్వరుడు వాళ్ళతో.

"స్వామీ, ఈ కన్యల కొరకు మేము ప్రాణా లర్పించటానికైనా సిద్ధంగానే ఉన్నాం. వారెక్కడ ఉండేదీ మీరు చెప్పండి," అన్నారు రాజకుమారులు.

"చెప్పమంటే చెబుతాను, మీరు వారున్న చోటికి వెళ్ళవచ్చు గాని ప్రాణాలతో తిరిగి రారు," అన్నాడు మునీశ్వరుడు. అయినా వాళ్ళు తమ నిశ్చయాన్ని మార్చుకోలేదు.

అప్పుడు మునీశ్వరుడు ప్రతాపుణ్ణి తన వెంట అవతలికి తీసుకుపోయి, "నాయనా, నిన్ను ఆకర్షించిన కన్య బంగారు కన్య. ఆమెను చేరే పద్ధతి చెబుతాను, శ్రద్ధగా



విను. నువు ఇప్పుడే బయలుదేరి తిన్నగా పడమటి దిక్కుగా వెళ్ళు. సూర్యాస్తమయం వేళకు నీకు ఒక సెలయేరు తగులుతుంది. దాని ప్రవాహం వెంబడే వెళితే ఒక చిన్న వంతెన వస్తుంది. అక్కడ ఉండే పదును రాయి తీసుకుని, దానితో నీ అరచెయ్యి కోసుకుని, నీ రక్తం మూడు బొట్లు సెలయేటి ప్రవాహంలో రాల్చి, 'బంగారు కన్య వద్దకు వెళ్ళేదారి తెరుచుకోవాలి!' అను. వెంటనే నీకు బంగారు మెట్లు కనిపిస్తాయి. ఆ మెట్లు ఎక్కి వెళ్ళితే నీకు ఒక బంగారు తలుపూ, పక్కనే కొయ్యతలుపూ కనిపిస్తాయి. ముందు కొయ్యతలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళు. లోపల ఒక బంగారు కూజా ఉంటుంది. దాన్ని తీసుకుని ఇవతలికి వచ్చి, బంగారు తలుపు తెరిచి లోపలికి వెళ్ళు. అక్కడ నీకు బంగారు కన్య కనిపిస్తుంది. ఆమెమీద కూజాలో ఉండే ద్రవం చల్లు. అప్పుడు బంగారు కన్యతోబాటు బంగారమే నీకు సిద్ధిస్తుంది. నీకు శుభం కలుగుగాక! వెళ్ళు!" అన్నాడు.

ముని చెప్పినట్టే ప్రతాపుడు పడమరగా బయలుదేరి, సూర్యాస్తమయం వేళకు సెలయేరు చేరాడు. సెలయేరు వెంబడి అతను వంతెన ఉన్నచోటు చేరుకుని, "బంగారు కన్య వద్దకు వెళ్ళేదారి తెరుచుకోవాలి!" అన్నాడు. కాని ఏమీ జరగలేదు. అప్పుడతను మునిమాటలు గుర్తు తెచ్చుకుని, ఒక రాతితో చెయ్యికోసుకుని, మూడు రక్తం బొట్లు సెలయేటిలోకి విడిచి ముని చెప్పినట్టు అనగానే బంగారు మెట్లు కనిపించాయి. అతను వేగంగా మెట్లెక్కి పైకి వెళ్ళేసరికి, అక్కడ బంగారు తలుపూ, కొయ్యతలుపూ కనిపించాయి.

ప్రతాపుడు బంగారు కన్యను చూడాలన్న ఆత్రంలో మునీశ్వరుడి మాటలు మరిచిపోయి, కొయ్యతలుపును పట్టించుకోక, బంగారు తలుపు తోసుకుని లోపలికి వెళ్ళాడు. బంగారు కన్య బంగారు సింహాసనం మీద కూర్చుని ఉండి, "రాజకుమారా, నన్ను చెరవిడిపించ వచ్చావా? ఆహా,

ఎలాంటి సుదినం! ఇలా వచ్చి నా సరసన కూర్చో," అన్నది.

ప్రతాపుడు అతివేగంగా ఆమెను సమీపించాడు. అయితే ఆమె తన చేతిలో ఉన్న బంగారు బెత్తంతో అతన్ని తాకేసరికి, బంగారు విగ్రహంగా మారిపోయాడు.

అరణ్యంలోని పర్ణశాలలో మునీశ్వరుడు ప్రతాపుడి కోసం వారం రోజులు ఎదురు చూసి నిరాశపడ్డాడు. మిగిలిన ఇద్దరు రాజకుమారులూ తాము మోహించిన కన్యల కోసం బయలుదేరాలని తొందరపడుతూంటే, ఆయన వారితో, "వెళ్ళకండి. ప్రతాపుడు నశించాడు," అని చెప్పాడు.

కాని ఉల్లాసుడు ఏమైనా వెళ్ళితీరాలని పట్టుబట్టాడు. ముని అతన్ని అవతలికి తీసుకుపోయి, వెండి కన్యను చేరేమార్గం ఇలా చెప్పాడు:

"సూటిగా దక్షిణంగా వెళ్ళు. మిట్ట మధ్యాన్నం అయేసరికి ఒక కొండ వస్తుంది. ఆ కొండ కింద ఒక జమ్మిచెట్టు ఉంటుంది. ఆ జమ్మిచెట్టుకు ఒక వెండి బెత్తం కట్టి ఉంటుంది. ఆ బెత్తాన్ని తీసుకుని దాని కింద నేలను కొట్టావంటే దారి తెరుచుకుంటుంది. ఆ ద్వారంకుండా వెళ్ళితే ఒక వెండి కుటీరమూ, ఒక వెండి మల్లెపొదా కనిపిస్తాయి. ఆ పొద మీద ఒక వెండి పంజరంలో వెండి పక్షి ఉంటుంది. ముందుగా ఆ వెండి పక్షిని తీసుకుని వెండి కుటీరం ప్రవేశించు. అక్కడ వెండి కన్య సింహాసనం మీద కూర్చుని ఉంటుంది. వెండి





పక్షి ఈక ఒకటి తీసి వెండి కన్య మీదికి విసురు. అప్పు డామె శక్తులన్నీ పోయి నీకు స్వాధీనం కాపటమేగాక, వెండి అంతా నీ అధీన మవుతుంది.''

ఉల్లాసుడు ముని చెప్పినదంతా తనకు గుర్తు ఉంటుందని చెప్పి, ఆయన ఆశీర్వాదం పొంది, బయలుదేరాడు. సరిగా సూర్యుడు నడి నెత్తికి వచ్చేసరికి అతను కొండ దగ్గిర ఉన్న జమ్మిచెట్టు చేరాడు. దానికి వేళాడుతున్న వెండి బెత్తాన్ని ఊడదీసి అతను నేలమీద కొట్టేసరికి సొరంగం ఏర్పడింది. దాని వెంబడి అతను వెండి కుటీరం చేరుకుని, అక్కడే ఉన్న వెండి పల్లె పాడసూ. పంజరాన్ని. పక్షినీ గమనించకుండా వెండి కుటీరం ప్రవేశించాడు. అక్కడ అతనికి వెండి కన్య సింహాసనం మీద కూర్చుని కనిపించి, దగ్గిరికి రమ్మని ప్రేమగా పిలిచింది ; కాని అతను సమీపంగా రాగానే అతన్ని వెండి బెత్తంతో తాకి, వెండి ప్రతిమగా మార్చేసింది.

మరోవారం గడిచింది. అరణ్యంలో ముని పర్ణశాలకు ప్రతాపుడుగాని, ఉల్లాసుడుగాని తిరిగి రాలేదు. విజయుడు తాను మోహించిన కన్య కోసం బయలుదేరాలని తొందరపడుతున్నాడు. ముని అతన్ని వారిస్తూ, "నాయనా, నీ అన్న లిద్దరూ నశించారు. నువు కూడా ఎందుకు అపజయం పొందుతావు? వెళ్ళకు!'' అన్నాడు.

"స్వామీ, నా పేరే విజయుడు. నేను అపజయం పొందను,'' అన్నాడు విజయుడు.

"నీకు వెళ్ళాలని పట్టుదలగా ఉంటే, ఉత్తరంగా వెళ్ళు. సూర్యోదయం అయే సరికి నువు ఒక కందకాన్ని చేరుకుంటావు. అక్కడ నీకు ఒక ఉక్కు కుటీరమూ, ఒక పూరి గుడిసె కనిపిస్తాయి. మొదట పూరి గుడిసెలోకి వెళ్ళు. అక్కడ నీ కొక ఉక్కు ఖడ్గం కనిపిస్తుంది. అది తీసుకున్నాక ఉక్కు కుటీరంలోకి వెళ్ళు. అక్కడ, నువు మోహించిన కన్య ఉంటుంది. ఆమెను చూడగానే ఆమె చేతిలో ఉండే

కత్తి ఎగరగొట్టు. అప్పుడామె నీకు వశం కావటమేగాక, ఉక్కు కూడా నీకు వశమవుతుంది. విజయుడివిగా తిరిగిరా," అన్నాడు మునీశ్వరుడు.

విజయుడు ఉత్తరంగా బయలుదేరి, సూర్యోదయం వేళకు ఒక లోతైన కంపకం చేరుకున్నాడు. అక్కడే అతనికి ఉక్కు కుటీరమూ, పూరి గుడిసే కనిపించాయి. అతను ముందుగా పూరి గుడిసె ప్రవేశించి, అక్కడ ఉన్న ఉక్కు ఖడ్గాన్ని తీసుకుని, ఉక్కు కుటీరంలోకి వెళ్ళి, సింహాసనం మీద ఉక్కు కన్యను చూశాడు. ఆమె కూడా అతన్ని ప్రేమగా దగ్గిరికి పిలిచింది.

అతను ఆమెను సమీపిస్తూనే తన ఉక్కు కత్తితో ఆమె చేతిలోని కత్తిని ఒక్క దెబ్బ కొట్టి విరిచి, కింద పడేశాడు. వెంటనే ఆ కన్య పరిసరాలలో ఉన్న మాయ అంతా విచ్చి పోయింది. గుడిసెలు రెండూ మాయమయాయి. ఉక్కు కన్య అతన్ని తన భర్తగా స్వీకరించింది.

బంగారు కన్యా, వెండి కన్యా ఎక్కడ ఉండేదీ ఉక్కు కన్య ఎరుగును. వారామె అక్కలు. ముగ్గురూ శాపగ్రస్తలైనవాళ్ళే. ఉక్కుకన్య సహాయంతో విజయుడు వారున్న ప్రదేశాలకు వెళ్ళి, బంగారు కన్యకూ, వెండి కన్యకూ శాపవిముక్తి కలిగించి, అన్నలను తిరిగి బతికించుకున్నాడు.



తరవాత ముగ్గురు రాజకుమారులూ తమ భార్యలతో సహా మునీశ్వరుడి కుటీరానికి వచ్చి, ఆయనకు తమ కృతజ్ఞతలు చెప్పుకుని, తమ దేశానికి తిరిగి వచ్చారు.

రాజకుమారులు తెచ్చుకున్న కన్యల అద్భుత సౌందర్యం చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. రాజు వారందరికీ అమిత వైభవంగా పెళ్ళిళ్ళు చేసి, రాజ్యార్హత నిర్ణయించటానికి సభ చేశాడు.

రాజు పెద్దలతో, "నా కొడుకులు నా కోరికపై వెళ్ళి తమతమ శక్తులకు తగినట్టుగా అపూర్వమైన వస్తువులు సాధించుకు వచ్చారు. ప్రతాపుడు బంగారం సాధించాడు, ఉల్లాసుడు వెండి సాధించాడు, విజయుడు

ఉక్కు సాధించాడు. వీరిలో ఎవరికి పట్టం గట్టాలో నిర్ణయించండి,'' అన్నాడు.

పెద్దల మధ్య కొంతసేపు చర్చ జరిగాక, వారిలో వృద్ధుడు లేచి, ''మహారాజా, విజయుడికి పట్టంగట్టండి,'' అన్నాడు.

రాజు అలాగే చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, ''రాజా, వెలలేని బంగారమూ, విలువైన వెండీ తెచ్చిన ప్రతాప, ఉల్లాసులను కాదని ఆ వృద్ధుడు విజయుడికి ఎందుకు పట్టం కట్టమన్నాడు? తన అన్నలు విఫలులైన చోట అతను విజయం సాధించాడనా? అతనిలో నిజంగా రాజ్యార్హత ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విజయుడు తన అన్నల విజయానికి సహాయ పడ్డాడన్న విషయం పెద్దలు చర్చించినట్టు కనబడదు. ఎవరేమి సాధించుకు వచ్చారన్నదే చర్చకు వచ్చింది. రాజకుమారులకు మొదట పెట్టిన పరీక్ష కూడా ఎవరు హెచ్చు విలువగల దాన్ని సాధించుకు వస్తారన్నదే. పెద్దవాడు బంగారమూ, రెండోవాడు వెండీ సాధించారు. అవి విలువైనవే కాని దేశానికి వాటివల్ల ప్రయోజనం చాలా తక్కువ. వాటితో పోల్చితే ఉక్కు విలువ ఎంతో హెచ్చు. వ్యవసాయ పరికరా లన్నిటికీ ఉక్కు కావాలి; దేశరక్షణకు ఆయుధాలు తయారు చెయ్యాలంటే ఉక్కు అవసరం. వెండి బంగారాలు వ్యక్తుల విలువ పెంచవచ్చు గాని, దేశం విలువా, రాజ్యం బలమూ ఉక్కు మీదనే ఆధారపడి ఉన్నాయి. అందుకే విజయుడు రాజ్యార్హుడయాడు. అన్నలతో పోల్చితే అతను రాజ్యార్హుడే. అన్నలు తాము మోహించిన కన్యల కోసం ఆత్రపడి, ముని చెప్పినట్టు చెయ్యక అప జయం పొందారు; తమ చేతిలో ఉన్న విజయాన్ని కూడా సాధించలేకపోయారు. ఈ లోపం విజయుడిలో లేదు,'' అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# సరిఅయిన విచారణ

పూర్వం ఒక రాజ్యంలో ఒక పక్కగా ఒక గోకులం ఉండేది. అక్కడ పశుపోషకులు ఉండే వారు. ఆ గోకులంలో వీరన్న అనే కుర్రవాడు ఒకడు ఉండేవాడు. గోకులంలో ఉండే మిగిలిన కుర్ర వాళ్ళందరూ వాడి శాసనానికి లోబడి ఉండి, వాడు చెప్పిన దెల్లా చేస్తూ, వాణ్ణి వీరరాజు అని పిలిచే వారు. వాడికి "చిన్న రాజు" అనే బిరుదు కూడా ఉండేది.

ఒకనాడు కుర్రవాళ్ళు పశువులను మేపుతూ ఉండగా, ఒక బ్రాహ్మణుడు తన భార్యతోనూ, పిల్లలతోనూ ఎక్కడికోపోతూ వీరన్నకు దూరంగా కనిపించారు. వెంటనే వీరన్న తనతోటి కుర్రవాళ్ళతో, "ఒరే, త్వరగాపోయి వాళ్ళను పిలుచుకురండి. చాలా దీనస్థితిలో ఉన్నట్టున్నారు. ఇక్కడ చెట్ల కింద కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని పోతారు," అన్నాడు.

కుర్రవాళ్ళు బ్రాహ్మడి వద్దకు వెళ్ళి, "మీరు కాస్సేపు అక్కడ చెట్ల కింద విశ్రాంతి తీసుకుని వెళ్ళండి," అన్నారు.

బ్రాహ్మణుడు విసుగుగా, "మాకు విశ్రాంతీ వద్దు, ఏమీవద్దు," అని ముందుకు సాగబోయాడు.

కాని పశువుల కాపరి కుర్రాళ్ళు అయనను పోనివ్వక, "మీరు వెళ్ళటానికి వీల్లేదు. మా వీరరాజు మాటంటే ఆజ్ఞే!" అన్నారు.

బ్రాహ్మణుడు తన భార్యా బిడ్డలతో సహా వీరన్న ఉన్నచోటికి వచ్చాడు. వీరన్న ఒక చప్టాయి మీద కూర్చుని ఉన్నాడు. బ్రాహ్మణ కుటుంబం దగ్గిరికి రాగానే అతను చప్పున లేచి నిలబడి, నమస్కారం చేసి, అందరినీ కూర్చోమని, "అయ్యా, మీరు దూరప్రయాణం మీద వెళుతున్నట్టున్నారు. మీ ముఖాలు చూస్తే మీకేదో కష్టం వచ్చినట్టు కనబడుతుంది. మా వల్ల

ఎస్. కేశవరావు



సహాయం కావలిస్తే చెప్పండి, చేతనైతే చేస్తాం," అని బ్రాహ్మణుడితో అన్నాడు.

బ్రాహ్మణుడు వీరన్నతో, "నువు ఊహించినది నిజమే నాయనా. ఈ రాజ్యంలో న్యాయమూ, ధర్మమూ నశించాయి. అందుచేత ఇక్కడ ఉన్నదంతా విడిచిపెట్టి దేశాంతరం పోతున్నాం." అని తన కథ ఈ విధంగా చెప్పాడు:

ఆ బ్రాహ్మణుడు ఒక పండితుడు. ఉన్న గ్రామంలోనే దొరికినంత ఆర్జిస్తూ, ఉన్న దానితో సరిపెట్టుకుంటూ, సామాన్య జీవితం గడుపుతూ వస్తున్నాడు. ఆయనకు ఎప్పుడో ఒక శ్రీమంతుడు, ఆయన విద్వత్తుకు సంతోషించి, ఒక నీలమణిని బహుమానంగా ఇచ్చాడు. కాని బ్రాహ్మణుడు దాన్ని అమ్ముకుని తినక, అది తన విద్వత్తుకు చిహ్నంగా శాశ్వతంగా తమ వంశంలో ఉండి పోవాలనుకుని, దాన్ని జాగ్రత్తగా దాచుకున్నాడు.

ఇలా ఉండగా బ్రాహ్మణుడి కుమార్తెకు వివాహం చెయ్యవలసి వచ్చింది. పెళ్ళి ఖర్చుల కోసం ధనం అవసరమయింది. డబ్బు పుట్టించే మార్గం మరేదీలేక బ్రాహ్మణుడు తన నీలమణిని ఒక షావుకారు వద్ద కుదువబెట్టి, వెయ్యివరహాలు అప్పుగా తెచ్చుకున్నాడు. పెళ్ళి జరిగిపోయింది.

ఒక సంవత్సరానికి ఆ బ్రాహ్మణుడు వెయ్యివరహాలూ, దాని మీద వడ్డీ సేకరించి తీసుకుపోయి, షావుకారు అప్పు తీర్చి, తన మణిని తనకు ఇచ్చెయ్యమని అడిగాడు.

షావుకారు తన డబ్బు లెక్కచూసుకుని పెట్టెలో పెట్టుకుని, "మీ మణి నా భార్య పెట్టెలో ఉన్నది. నా భార్య గ్రామాంతరం వెళ్ళింది. ఆమె రాగానే ఇస్తాను," అన్నాడు. షావుకారు బ్రాహ్మణుణ్ణి మణికోసం చాలా సార్లు తిప్పాడు. ఒకసారి, తన భార్య పుట్టింటి నుంచి తిరిగి రాలేదన్నాడు; మరొకసారి, తన భార్యపెట్టె తాళపుచెవి కనిపించటం లేదన్నాడు; ఇంకోసారి, తాను ఇంట్లో లేడని చెప్పించాడు.

చివరకు షావుకారు, "ఇదేమిటయ్యా? నువు బాకీ చెల్లించినప్పుడే నీకు తాకట్టు

వస్తువు తిరిగి ఇస్తిని కదా! మళ్ళీ తెమ్మంటె నేనెక్కడ తెచ్చేది?" అనేశాడు. ఈ అన్యాయం సహించలేక బ్రాహ్మణుడు గట్టిగా కేకలు పెట్టాడు. షావుకారు ఆయనను తన మనుషులచేత బయటికి నెట్టించాడు. బ్రాహ్మణుడు రాజుగారి దగ్గిరికి వెళ్ళి, షావుకారు మీద ఫిర్యాదు చేశాడు. షావుకారు ఇద్దరు మనుషులకు లంచంపెట్టి, తనకు అనుకూలంగా సాక్ష్యం చెప్పటానికి సిద్ధంచేశాడు. ఆ సాక్షులు రాజుగారి ఎదట సాక్ష్యం ఇస్తూ, బ్రాహ్మణుడు అప్పు తీర్చి నీలమణి తీసుకుని వెళ్ళిపోవటం తాము కళ్ళారా చూశామని అన్నారు.




రాజుగారు బ్రాహ్మణుడి ఫిర్యాదును కొట్టివేయటమే గాక, అలాటి దురాశ పనికి రాదనీ, పరువు మర్యాదలు గల షావుకార్లకు ద్రోహం ఆరోపించటం చాలా పెద్ద నేరమనీ, పేరు ప్రతిష్ఠలుగల బ్రాహ్మణుడు అయిపోయినందున శిక్షించకుండా వదిలేస్తున్నాననీ అన్నాడు.

తనకు న్యాయం జరగకపోగా అవమానం కూడా పొందిన బ్రాహ్మణుడికి ఇక ఆ రాజ్యంలో ఉండాలనిపించలేదు. అందుచేత ఆయన తన ఇల్లూ, వాకిలీ వదిలి, దేశాంతరం వెళ్ళిపోతున్నాడు.

బ్రాహ్మణుడి కథ అంతావిని వీరన్న, "పండితుడా, నీకు ఈ దేశంలోనే న్యాయం జరిగేటట్టు నేను చూస్తాను. మీరంతా దేశాంతరం వెళ్ళవద్దు. మీకు అన్ని సదుపాయాలూ నేను సమకూర్చుతాను." అని తనతోటి కుర్రవాళ్ళకు పనులు చెప్పాడు.

వీరన్న ఆజ్ఞప్రకారం ఆ కుర్రవాళ్ళు అక్కడే ఒక కుటీరం కట్టి, బ్రాహ్మణ కుటుంబానికి కావలసిన బియ్యమూ, ఉప్పూ, పప్పూ, కూరలూ తెచ్చి పడేశారు. బ్రాహ్మణుడు ఈ తతంగమంతా చూసి ఆశ్చర్యపడి, సకుటుంబంగా అక్కడే ఉండిపోయాడు.

తరవాత వీరన్న రాజుగారికి ఒక కుర్రవాడి ద్వారా ఇలా సందేశం పంపాడు: "మహారాజుగారు ఒక బ్రాహ్మణుడికీ, షావుకారుకూ నీలమణి సందర్భంగా జరిపిన



విచారణ అనంతరం ఇచ్చిన తీర్పు సరి అయినది కాదు. ఆ విచారణ సక్రమంగా జరగలేదు. ఇందువల్ల మహారాజుగారికి చెడ్డపేరు వస్తుంది. మహారాజుగారు అనుమతించినట్టయితే నేను స్వయంగా తిరిగి విచారణ జరిపి, సరి అయిన తీర్పు ఇవ్వగలను—చిన్నరాజు."

ఈ సందేశం చదువుకుని రాజు మొదట చకితుడైనాడు. కాని తరవాత అయనకు కుతూహలం కలిగి, వీరన్న వచ్చి విచారణ జరపటానికి అనుమతి ఇచ్చాడు. వీరన్న బ్రాహ్మణుణ్ణి వెంట బెట్టుకుని రాజభవనానికి వచ్చి, తాను ఏ విధంగా విచారణ జరపదలచినదీ రాజుగారికి తెలియజేశాడు.

రాజుగారి సభలో ఒక పశువుల కాపరి విచారణ జరిపి, న్యాయనిర్ణయం చేయబోతున్నాడని తెలిసి, రాణీగారూ, అంతఃపుర పరిచారికలూ వచ్చి పక్కగదులలో కూర్చున్నారు. షావుకారూ, అతని ఇద్దరు సాక్షులూ, బ్రాహ్మణుడూ వేరువేరు ప్రదేశాలలో ఉంచబడ్డారు. ముఖ్యులతో సభ అంతా నిండిపోయింది. వీరన్న రాజుగారి పాదాల దగ్గిర కూర్చున్నాడు.

మొదట బ్రాహ్మణుడు వచ్చి తన కథ అంతా సభవారికి చెప్పుకున్నాడు. వీరన్న చూపిన చిన్నచిన్న రాళ్ళను చూసి బ్రాహ్మణుడు తన నీలమణి ఏ రాయి ప్రమాణంలో ఉండేదీ చెప్పాడు! అక్కడ ఉన్న రకరకాల నీలంరంగు గుడ్డపేలికలలో ఏ పేలిక రంగులో తన మణి ఉండేదీ చూపాడు.

తరవాత షావుకారు వచ్చి, బ్రాహ్మణుడు తన వద్ద ఉంచిన మణిప్రమాణాన్నీ, రంగునూ బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారమే సూచించాడు.

వాళ్ళిద్దరూ చెప్పిన విషయాలలో తేడా ఏమంటే, బ్రాహ్మణుడు, తనకు మణి తిరిగి రాలేదనీ, తాను మణిని తాకట్టు పెట్టినప్పుడు గాని, డబ్బు చెల్లించినప్పుడుగాని అక్కడ ఎవరూ లేరనీ అన్నాడు; షావుకారు, తాను మణి తిరిగి ఇచ్చిన సమయంలో ఇద్దరు మనుషులు అక్కడ ఉన్నారన్నాడు.



మొదటి సాక్షిని రప్పించి ప్రశ్నించాడు వీరన్న. తాను అయిదువందల వరహాలు అప్పుకావలసి షావుకారు దగ్గిరికి వచ్చాననీ, బ్రాహ్మణుడు బాకీ తీర్చిన డబ్బునుంచే షావుకారు తనకు డబ్బు ఇచ్చాడనీ ఈ సాక్షి చెప్పాడు; తాను షావుకారు దగ్గిరికి వెళ్ళే సరికి రెండోసాక్షి అక్కడ లేడనీ, వాడు తరవాత వచ్చాడనీ అన్నాడు; షావుకారు నీలమణిని పసుపు పచ్చని పట్టుగుడ్డలో కట్టి ఇచ్చాడనీ, బ్రాహ్మణుడు దాన్ని బొడ్డులో దోపుకున్నాడనీ అన్నాడు. అయితే ఈ సాక్షి మణి ఏ ప్రమాణంలో ఉండేదీ, ఏ రంగులో ఉండేదీ సరిగా చెప్పలేదు.

తరవాత రెండో సాక్షిని పిలిపించి వీరన్న ప్రశ్నించాడు. రెండో సాక్షి చెప్పినది మొదటివాడు చెప్పిన దానికి పొందలేదు. బ్రాహ్మణుడు రావటం తాను అక్కడ ఉండగా జరిగిందన్నాడు ఈ సాక్షి. నీలమణి ప్రమాణాన్ని మరొక రకంగా చెప్పాడు.

వీరన్న సాక్షిని పంపేసి రాజుతో, "చూశారా, మహారాజా? వీళ్ళిద్దరూ దొంగ సాక్షులు. షావుకారు దొంగ సాక్ష్యం ఎందుకు తెచ్చాడో తమరు బయటికి తీసినట్టయితే ఈ విచారణ పూర్తి అయి న్యాయం జరుగుతుంది. షావుకారు నిజం చెప్పక పోయినట్టయితే అతని భార్యను పిలిచి, ఆమె పుట్టింటికి వెళ్ళినదీ లేనిదీ, ఎప్పుడు వెళ్ళినదీ, ఎప్పుడు తిరిగి వచ్చినదీ, నీలమణి ఆమె పెట్టెలో ఉండినదీ, లేనిదీ, ఆమె పెట్టెతాళంచెవి పోయినదీ లేనిదీ విచారించ వచ్చు." అన్నాడు.

విచారణ అనేది ఎంత పరిశీలనగా చెయ్యవచ్చో రాజుకు అర్థమయింది. ఆయన షావుకారు సాక్షులను పిలిచి, అబద్ధాలా[illegible] సందుకు తలలు తీసేస్తాననే సరికి, వాళ్ళిద్దరూ రాజుగారి కాళ్ళపైనపడి, షావుకారు తమకు చెరొక అయిదు వరహాలూ ఇచ్చి తనకు అనుకూలంగా సాక్ష్యం చెప్పమన్నాడని ఒప్పుకున్నారు.

తన సాక్షులు నిజం బయటపెట్టేసినాక షావుకారు నేరం ఒప్పుకోక తప్పలేదు.

ఆయన రాకభటుల వెంట ఇంటికి వెళ్ళి, నీలమణినీ, రాజుగారు విధించిన పరిహారం సొమ్మునూ తెచ్చి బ్రాహ్మణుడికి ఇచ్చు కున్నాడు. తరవాత రాజుగారు షావు కారుకూ, అతని సాక్షులకూ కారాగృహ వాసశిక్ష విధించాడు.

రాజుగారు వీరన్న శక్తి యుక్తులను ఎంతగానో శ్లాఘించాడు. అప్పుడు బ్రాహ్మ ణుడు వీరన్న చెయ్యి చూసి, "మహారాజా, ఈ కుర్రవాడి చేతిలో రాజలక్షణాలు కొన్ని ఉన్నాయి. రాజ్యభ్రష్టులై అజ్ఞాతంగా గోకు లంలో తలదాచుకున్న ఏ రాజదంపతులో ఇతని తల్లిదండ్రులై ఉంటారని నాకు అను మానంగా ఉన్నది," అన్నాడు.

పక్కగదిలో నుంచి ఈ మాటలు విన్న రాణి మూర్ఛపోయింది. ఆమెకు, శైత్యోప చారాలు చేసి, మూర్ఛ తెలిసేటట్టు చేశారు. తరవాత రాజు ఆమెను, "ఎందుకలా మూర్ఛపోయావు ?" అని అడిగాడు.

రాణి రాజుగారి వద్ద ముందుగా అభయం పొంది తన రహస్యం బయటపెట్టింది.

రాజు నల్లటివాడు. రాణి తెల్లని తెలుపు. రాణి గర్భవతి అయిఉంగా రాజమాత రాజుతో, "నీకు కలగబోయే బిడ్డకూడా నలుపైతే నువు మరొక భార్యను చేసుకో," అని చెప్పింది.

ఈ మాట రాణి చెవినపడింది. తనకు నల్లని బిడ్డపుడితే తన జీవితానికి భవిష్యత్తు ఉండదని గ్రహించి ఆమె, అలాజరిగిన పక్షంలో ఆ బిడ్డను మార్చటానికి తన పరి చారికతో ముందుగానే ఏర్పాటు చేసింది. రాణి ప్రసవం అయేసమయంలోనే ఆడ మనిషి ఒకతె గోకులంలో తెల్లని పిల్లవాణ్ణి కన్నది. దురదృష్ట వశాన రాణికి నల్లని కొడుకే కలిగాడు. రాణిపరిచారిక చాలా నేర్పుగా ఆ బిడ్డలను మార్చేసింది. అలా మారి గోకులంలో పెరిగిన బిడ్డే వీరన్న.

రాణి చెప్పిన కథ తేలికగా రుజువయింది. రాజుగారు తన కొడుకు అనుకుని పెంచు కున్నవాడు మందబుద్ధి. రాజు వీరన్నను సంతోషంగా స్వీకరించుకుని, అతను తన కొడుకేనని బహిరంగంగా ప్రకటించాడు.





# తగని సంపద

## 2

అబూఅల్ కాసిం ఖలీఫాను చెయ్యిపట్టుకుని తీసుకుపోయి ఒక చల్లని గదిలో బంగారు ఆసనం మీద కూర్చోబెట్టాడు. ఆ గదిలో సాంబ్రాణి కాలుతున్నది. గదినిండా సుగంధ ధూపం ఉన్నది. నేలమీద మెత్తని తివాసీ ఉన్నది. అబూ ఖలీఫా సరసనే కూర్చుని, తన కథ ఇలా చెప్పసాగాడు:

మా తండ్రి అబ్దుల్ అజీజ్ అనేవాడు కైరోనగరంలో ప్రసిద్ధి కెక్కిన నగల వర్తకుడు. ఆయన తాతముత్తాతలు కూడా ఆ నగరంలో ఉండిన వారే అయినప్పటికీ, అపారంగా ధనం ఆర్జించిన నా తండ్రి ఈజిప్టు సుల్తాను లోభానికి వెరిచి, ఈ బస్రా నగరంలో, అబ్బాసిద్ ఖలీఫాల రక్షణలో తల దాచుకోవలసి వచ్చింది.

ఈ నగరంలోకెల్లా ధనికుడైన వర్తకుడి కుమార్తెను నా తండ్రి వివాహం చేసుకున్నాడు. ఆమెకు తోబుట్టువులు లేరు. నా తల్లిదండ్రులకు నే నొక్కణ్ణే సంతానం. ఈ కారణం చేత, నా చిన్నతనంలోనే తల్లిదండ్రులు చనిపోగా, నేను బ్రహ్మాండమైన ఆస్తికి వారసుణ్ణి అయాను.

అయితే నేను ఒళ్ళు తెలియకుండా ఖర్చుపెట్టి, రెండేళ్ళలో నాకున్నదంతా తగలేసుకుని, బస్రానగర మంతటా నా పేరు మారుమోగేటట్టు చేసుకున్నాను. ఇంత పేరు తెచ్చుకున్న చోట దరిద్రుడుగా జీవించలేక, బస్రా విడిచి మరెక్కడికైనా పోదలచి, ఇల్లు వాకిలి అమ్మేసి, వర్తకుల బిడారు వెంట బయలుదేరాను. మోసుల్, డమాస్కస్ నగరాలు చూసి, అక్కడినుంచి ఎడారిదాటి మక్కాయాత్ర చేసి, కొన్నాళ్ళతర్వాత నా తాతముత్తాతల జన్మస్థలమైన కైరో నగరం చేరుకున్నాను.

అరేబియా జానపదకథ



కైరోనగరపు భవనాలూ, మసీదులూ చూడగానే నాకు నా తండ్రి జ్ఞాపకం వచ్చి ఏడుపు వచ్చింది. ఆయన ఈ నగరంలో ఎంత వైభవంగా జీవించాడు! బరువెక్కిన గుండెతో సుల్తానుభవనం వెనుక ప్రాంతంలో ఉన్న నైల్‌నది ఒడ్డుకు వెళ్ళాను. నేను తల ఎత్తి చూసేసరికి, ఎత్తున ఉన్న గవాకం వద్ద ఒక యువతి ముఖం కనిపించి మాయమయింది. అందమైన ఆ ముఖం మళ్ళీ కనిపిస్తుందేమోనని చీకటిపడిన దాకా అక్కడే ఉండి పోయాను. కాని ఆ ముఖం తిరిగి కనిపించలేదు.

ఆ రాత్రి సత్రంలో నా బసకు తిరిగి వెళ్ళి, మర్నాడు ఉదయం మళ్ళీ అక్కడికే వచ్చి ఆ గవాక్షం కేసే చూస్తూ కూర్చున్నాను. ఆ రోజు నాకా ముఖం కనిపించలేదు గాని, గవాక్షపు తెర వెనక ఏదో మసులుతున్నట్టు నాకు తోచింది.

మూడో రోజు సాయంకాలం గవాక్షపు తెర పక్కకు తొలిగి, చుక్కలాటి ముఖం తళుక్కున మెరిసింది. నేనా ముఖానికి ఆత్మార్పణ చేసుకుని, "సుందరీ, నేను పరదేశిని. ఈ కైరోలోకి వస్తూనే శుభశకునంలాగా నీ ముఖం చూశాను. నా కోరిక ఈడేరుతుందా?" అన్నాను.

ఆమె ముఖాన భయం కనిపించింది. కాని మరుక్షణమే ఆమె గవాక్షం నుంచి బయటికి వంగి, రహస్యంగా, "ఇప్పుడు వెళ్ళిపో. అర్ధ రాత్రికి రా!" అని, అంతలోనే, మంత్రించినట్టు గవాక్షపు తెర వెనుక మాయమయింది.

నా ఆనందం వర్ణనాతీతం. ఆ ఆనందంలో నా కష్టాలన్నీ మరిచాను. నేను బసకు తిరిగి వెళ్ళి, స్నానశాలలో సుఖంగా స్నానం చేసి, అర్ధ రాత్రివేళ రాజభవన గవాక్షం చేరుకున్నాను. గవాక్షం నుంచి తాటి నిచ్చెన కిందికి వేళ్ళాడుతున్నది. నేను సాహసించి దాన్ని ఎక్కి లోపల ప్రవేశించాను. రెండు చీకటి గదులు దాటినాక మూడో గదిలో నేను ఆ సాయంత్రం చూసిన స్త్రీ కనిపించింది.

నే నామెకు నా కష్టాలు చెప్పుకున్నాను. ఆమె నా కథ విని కన్నీరు కార్చింది.

"విచారించకు. నీ ఒక్క కన్నీటి బిందువుతోనే నా కష్టాలన్నీ తుడిచి పెట్టుకు పోయాయి," అన్నాను.

ఆమె తన విషయం చెప్పింది: "నేను సుల్తాను ప్రియ భార్యను. నా పేరు లబీబా. నా పతనం కోసం కుట్రలు పన్నే సవతులు చాలామంది ఉన్నారు. నిన్ను చూడగానే, నీ వంటి భర్త ఉంటే ఎంత సుఖపడే దాన్నోగదా అనుకున్నాను."

మేమిలా మాట్లాడుతుండగా గది తలుపు ఎవరో తట్టారు. లబీబా భయాందోళనతో, "కొంప మునిగింది! సుల్తాను తప్ప మరె వరూ తలుపు తట్టరు!" అన్నది.

ఆమె భయపడినంతా అయింది. మరు క్షణం పదిమంది నల్ల బానిసలు గదిలోకి ప్రవేశించి, ఒక గవాక్షం కుండా నన్ను నదిలోకి విసిరివేశారు. , మరొక గవాక్షం కుండా లబీబా నదిలో పడిపోవటం చూశాను. నేనైతే ఎలాగో ఈది ప్రాణాలతో బయట పడగలిగాను గాని, నా మూలంగా నదికి బలి అయిన ఆ నిర్భాగ్యురాలి కోసం ఎంత వెతికినా దొరకలేదు.

నేను వెంటనే ఈజిప్టుదేశం వదిలి పెట్టి, బాగ్దాదు నగరానికి వచ్చాను. నా వద్ద ఒక్క బంగారు దీనారమే మిగిలి ఉన్నది. అది పెట్టి మిఠాయీ, పళ్ళూ, సుగంధ లేప నాలూ, గులాబీ అత్తరూ కొని, వాటిని ఒక తట్టలో పెట్టుకుని, పాటలు పాడుతూ





దుకాణాల దగ్గిర అమ్మసాగాను. నా కంఠం ఇంపుగా ఉండటం చేత అమ్మకం చురుకుగానే సాగింది.

ఇలా ఉండగా ఒకనాడు బాగ్దాదులో కెల్లా పెద్ద దుకాణం గల వర్తకుడు నా దగ్గిర ఒక పండుకొని, నన్ను తన పక్కనే కూర్చోమని, నా పేరు అడిగాడు.

"బాబుగారూ, మానేగాయాన్ని కెలకకండి," అని విచారంగా అన్నాను.

వెంటనే ఆయన మాట మార్చి, నా అమ్మకం గురించీ, లాభం గురించీ మాట్లాడి పది బంగారు దీనారాలిచ్చి పంపేశాడు. అటుతరవాత నేను ఆయన దుకాణానికి వెళ్ళి, ఏదో ఒకటి అమ్ముతూ వచ్చాను.

ఆయన నన్ను తన పక్కన కూర్చోబెట్టుకుని, నా పేరు అడిగేవాడు. కృతజ్ఞత కొద్దీ ఒకనాడు నే నాయనకు నా కథ అంతా చెప్పేశాను.

"నాయనా, అబూ అల్ కాసిమ్! నేను నీకు తండ్రి నవుతాను. నేను నీ తండ్రి కన్న ధనవంతుణ్ణి. నాకు పిల్లలు లేరు. నీ కష్టాలు ఈడేరాయి. ఆ తట్ట అవతల పారెయ్యి," అన్నాడాయన ఉద్రేకంతో.

ఆ మర్నాడే ఆయన దుకాణం కట్టేసి నాతో కూడా బస్రాకు బయలుదేరాడు. అదే ఆయన జన్మస్థలం. ఇక నుంచీ మే మిద్దరమూ బస్రాలోనే విశ్రాంతి తీసుకునేటట్టు నిర్ణయం జరిగింది.

బస్రాలో నన్నెరిగిన వాళ్ళందరూ నా దశ మారినందుకు ఎంతో సంతోషించారు. నేను నా కొత్త తండ్రిని సంతోష పెట్టటానికి శాయశక్తులా కృషి చేశాను. ఆయన నాతో అనేక సార్లు, "అబూ అల్ కాసిమ్, నేను నిన్ను చూసిన ఘడియ చాలా మంచిది. నువ్వు విశ్వాసపాత్రుడివి, ప్రేమ పాత్రుడివి. నా అనంతరం నీకు చెందబోయే సంపదకు అర్హుడివి," అనేవాడు.

ఒక ఏడాదిపాటు నేను ఎలాటి స్నేహితాలూ చెయ్యక, ఆయనకు సేవచెయ్యటంలోనే కాలమంతా గడిపాను. అంతలో ఆయనకు బాగా జబ్బు చేసింది.

ఆయన నన్ను దగ్గిరికి పిలిచి, "నాయనా, అనేకమంది తండ్రులు ఒక్క రోజైనా అనుభవించలేని పుత్రసౌఖ్యాన్ని నువ్వు నాకు ఏడాది పాటు కలిగించావు. అందుకు నిన్ను దీవిస్తున్నాను. దేవుడు నన్ను పిలిచేలోపుగా నేను నిర్వర్తించ వలసిన విధి ఒకటి ఉన్నది. ప్రపంచలో రాజులందరికీ కలిపినా లేనంత సంపద నీకు దక్కనున్నది. ఇది తరతరాలుగా మా వంశంలో వస్తున్నది. అది మొదట మాకు ఎలా వచ్చిందో నాకు తెలీదు. దాని రహస్యం మాతాత నాతండ్రికి చెప్పాడు; ఆయన నాకు చెప్పాడు," అన్నాడు.

ఆయన నా చెవిలో రహస్యంగా కొన్ని సంగతులు చెప్పి, "ఇది మా వంశంలో ఉండె తరగని సంపద. అందు చేత నువ్వు ధారాళంగా దానాలు చెయ్యి. అన్నిటి కన్నా సౌఖ్యం ప్రధానంగా చూసుకో. అల్లా నిన్ను దయగా చూసి, నీకు సుఖశాంతులు ఇస్తాడు," అని కన్నుమూశాడు.

నేను ఆయనకు నా విధులన్నీ నిర్వర్తించి, సంపదను ఆధీనం చేసుకున్నాను. పూర్వం నన్ను ఎరిగినవాళ్ళు, ఈసారి కూడా నేను బికారి నవుతానని జోస్యం చెప్పారు. కాని అలా జరగ లేదు. రోజురోజుకూ నా ఖర్చు పెరగసాగింది. బస్రాకు వచ్చే పరదేశీల కందరికీ రాజోపచారంగా ఆతిథ్యం ఇచ్చాను.




అయినా ఇతరులు ఊహించినట్టు నేను పేదవాణ్ణి కాలేదు.

నేను చేసే ఖర్చు చూసి నగరంలోని అధికార్లకు కన్ను కుట్టింది. ఒకనాడు నగరపు ప్రధాన కొత్వాలు నా వద్దకు వచ్చి, అదీ ఇదీ మాట్లాడి, "ఏ యువకుడు ఎంత ధారాళంగా డబ్బు ఖర్చుచేస్తే, నా కేమిటి? నేను పొట్టకిప్పలు కోసం ఉద్యోగం చేసుకునేవాణ్ణి! కాని, చిత్రమేమిటంటే, సరిగా రొట్టెలధర పెరిగిన సమయంలోనే మా ఆవు ఎండిపోయింది," అన్నాడు.

"మీ ఇంటిల్లి పాటికీ రొట్టెల కిందా, పాల కిందా సుమారుగా ఎంత ఖర్చు అవుతుంది?" అని అడిగాను.



"రోజుకు పది దీనారాలు మించదు," అన్నాడతను.

"అది చాలదు. రోజుకు నూరు ఇస్తాను. ప్రతి నెలారంభంలోనూ వచ్చి మా ఖజానా దారునుంచి సొమ్ము పుచ్చుకోండి," అన్నాను.

పెద్ద కొత్వాలు కృతజ్ఞతా పూర్వకంగా నా చేతిని తీసుకుని ముద్దాడ బోయాడు. అంతా అల్లా నుంచి వచ్చేదేనని గుర్తుంచుకుని, నేను అతన్ని నివారించాను.

మర్నాడే కాజీ వచ్చి, "నాయనా, అయిదో వంతు పేదలకు పంచాలన్న ప్రాచీన సంప్రదాయం ఒకటి ఉన్నది. మా లాంటి వాళ్ళు అలాటి విషయాలు ఉపేక్షించ రాదు," అన్నాడు.

"తమరు చెప్పేదేమిటో నాకు బోధ పడలేదు. కాని చాలాకాలంగా తమకొక విజ్ఞాపన చేయాలనుకుంటున్నాను. పేద వారికి పంచగలందులకు తమకు నిత్యమూ వెయ్యి దీనారాలు ఇవ్వాలనుకుంటున్నాను. దయచేసి తమరు వాటిని స్వీకరించాలి. నిరాకరించ వద్దు," అన్నాను.

కాజీ నా కోరికను దయతో ఆమోదించాడు.

మరి మూడు రోజుల అనంతరం బస్రా పాలకుడు (వలీ) నన్ను తన సమక్షానికి పిలిపించుకుని, ఎంతో దయగా మాట్లాడి, "నీలాటి యువకుడు తన నిధులను నాకు రహస్యంగా తెలియ బరచినట్టయితే అతను చేసే దుబారా ఖర్చు గురించి నేను ఆక్షేపించనని అందరికీ తెలుసు," అన్నాడు.

"వలీగారికి నేను అలాటి నిధులను చూపగలిగితే ఎంత బాగుండేది! అయితే ఈమధ్య నేనే మనుకున్నానంటే, నాకుగల కొద్ది ఆస్తిలో రోజుకు రెండువేల దీనారాలు సాధువులకు దానం చెయ్యటానికి ఏ అధికారి అయినా ఉంటే నాప్రాణానికి సుఖంగా ఉంటుంది గదా అనుకున్నాను," అన్నాను.

వలీగారు నా తరఫున ఆ మొత్తాన్ని సాధుసజ్జనులకు దానం చెయ్యటానికి దయతో ఆమోదించారు.

"అది మొదలు ఈ లంచాలు మాన కుండా ఇస్తూ వస్తున్నాను. ఆ ముగ్గురు అధి

కారులూ నన్ను చిత్తం వచ్చినట్టు కానుకలు ఇవ్వనిస్తున్నారు. ఇదే నా తరగని సంపద కథ. ఈ కథను నే నింతకుపూర్వం ఎవరికీ చెప్పి ఉండలేదు," అని అబూ అల్ కాసిమ్ ముగించాడు.

ఈ యువకుడి నిధిని చూడాలన్న కాంక్ష ఖలీఫాకు తీవ్రంగా కలిగింది. ఆయన ఆ యువకుడితో, "ఎంత తీసినా తరగని నిధి ఎలా ఉంటుందో నేను ఊహించలేకుండా ఉన్నాను. దాన్ని కళ్ళారా చూస్తే గాని నమ్మలేను. దాన్ని నాకు చూపినట్టయితే రహస్యభంగం చెయ్యనని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు.

"అతిథికి అసంతృప్తి కలిగించి పంపటం నాకు చావుకన్న బాధాకరమైనది. అందుచేత మీ కోరిక నిరాకరించను. కాని మీరు కొన్ని నియమాలకు అంగీకరిస్తే కాని నా నిధిని చూపించలేను. మీరు కళ్ళకు గంతలు కట్టుకోవలిసి ఉంటుంది. నేను మీ వెంట కత్తి చేత బట్టుకుని వస్తాను. మీరు ఏ మాత్రం దౌర్జన్యం చేయబూనుకున్నా నేను దానిని క్రూరంగా మీ పైన ప్రయోగిస్తాను. దానికి అభ్యంతరం లేకపోతే నా వెంట రండి," అన్నాడు అబూ అల్ కాసిమ్.

"నేను ఏ నియమాలకైనా సిద్ధమే," అన్నాడు ఖలీఫా.

అబూ అల్ కాసిమ్ ఖలీఫా కళ్ళకు గంతలు కట్టి నడిపించుకుంటూ రహస్యంగా ఉన్న మెట్ల మీదుగా భూగర్భంలోకి తీసుకు





పోయి, అనేక సొరంగాల కుండా తిప్పి తిప్పి తీసుకు పోయి, ఒక దీర్ఘమైన గుహ లోకి ప్రవేశపెట్టాడు. అది చాలా లోతున ఉన్నది. ఇక్కడ ఖలీఫా కళ్ళ గంతలు విప్పుకున్నాడు. అక్కడి గోడల నిండా అమర్చిన సూర్యకాంతిమణుల కాంతికి ఖలీఫా కళ్ళు జిగేలుమన్నాయి. ఆ కాంతిలో ఆయనకు నూరు అడుగుల వ్యాసం గల చలవరాతి కొలను లాటిది కనిపించింది. దాని నిండా బంగారు నాణాలున్నాయి. దాని గట్టున పన్నెండు విగ్రహాలున్నాయి. ఒక్కొక్క విగ్రహమూ ఒక్కొక్క రకం మణిలో మలిచినది. అన్ని విగ్రహాలకూ బంగారు దిమ్మలున్నాయి.

"ఈ బంగారు కొలనుకు అడుగులేదు. మా వంశంలో వారంతా ధారాళంగా ఖర్చు పెట్టగా బంగారం అరంగుళం కూడా తరగ లేదు," అంటూ అబూ అల్ కాసిమ్ ఖలీ ఫాను మరొక హాలులోకి తీసుకుపోయాడు. అక్కడ ఇంకా పెద్ద కొలను ఉన్నది. దాని నిండా ముడి వజ్రాలూ, సానపట్టినవీ పోసి ఉన్నాయి. దాని చుట్టూ రెండు వరసలలో చెట్లున్నాయి. అవి ఖలీఫాకు లభించిన "నెమలి చెట్టు" లాటివే.

కొలనుకు ఎగువగా కప్పు మీద ఇలా రాసి ఉన్నది.

"ధారాళంగా వ్యయం చేయగలవాడే కలి గినవాడు; స్నేహం తప్ప దక్కించుకోదగి నది ఏదీ లేదు."

ఖలీఫా ఇలాటి సంపదను చూస్తూ ఇంకా ఎన్నో హాలులు చూసి విసిగిన మీదట, అబూ అల్ కాసిమ్ ఆయన కళ్ళకు తిరిగి గంతలు కట్టి, తన ఇంటికి తీసుకు వచ్చాడు.

ఇద్దరూ కూర్చున్నాక ఖలీఫా యువకు డితో, "నువు నాకు బహుమానంగా ఇచ్చిన అమ్మాయిని చూస్తే, నీ యింట చాలా మంది సౌందర్యవతులు ఉండాలని పిస్తుంది," అన్నాడు.

"లేకేం ఉన్నారు. కాని నాకు వారందరి కన్నా, నన్ను ప్రేమించి నదికి బలి అయిన ఒక్క స్త్రీ జ్ఞాపకం విలువైనది. లతీబా నాకు

తిరిగి దక్కేటట్టుంటే మీరు చూసిన నా సంపద అంతా ఇచ్చెయ్యగలను." అన్నాడు అబూ అల్ కాసిమ్.

అతను ఆ స్త్రీని ఇంతకాలమూ మరిచి పోలేక పోవటం చూసి మెచ్చుకుని ఖలీఫా అతనితో, "ఎదట ఉన్న సౌఖ్యాలలో గతించిన కష్టాలు మరిచిపోవాలి," అన్నాడు.

ఖలీఫా అతని వద్ద సెలవు పుచ్చుకుని, అతను ఇచ్చిన కానుకలతోనూ, బానిసల తోనూ బాగ్దాదుకు తిరిగి వచ్చాడు. వస్తూనే ఆయన కారాగృహం నుంచి తన వజీరైన జఫర్‌ను రప్పించి, క్షమించి, బహుమానా లిచ్చి, "జఫర్, అబూ అల్ కాసిమ్‌ను ఏ విధంగా సత్కరించాలి? ఏ బహుమానా లిచ్చినా అతనికి పేదగానే కనబడతాయి," అన్నాడు.

"అతన్ని బస్రా పాలకుడుగా నియ మించవచ్చు," అన్నాడు జఫర్.

"అయితే నువు వెళ్ళి అతన్ని తీసుకురా. అతని రాజ్యాభిషేకం మన కళ్ళముందే జరుపుదాం," అన్నాడు ఖలీఫా.

జఫర్ వెంట అబూ అల్ కాసిమ్ రాగానే ఖలీఫా అతన్ని పుత్రవాత్సల్యంతో కౌగలించు కుని, తానే స్వయంగా అతన్ని స్నానశాలకు తీసుకుపోయి స్నానంచేయించి, ఇద్దరూ ఫలహారం చేసే సమయంలో గానం చెయ్య టానికి ఒక బానిస యువతిని రప్పించాడు.

అబూ అల్ కాసిమ్ ఆ బానిస యువతి ముఖం చూస్తూనే గట్టిగా అరిచి మూర్ఛ పోయాడు.

అతను తిరిగి స్పృహతెచ్చుకున్నాక అతని మూర్ఛకు కారణం తెలిసింది. ఖలీఫా పిలిపించిన బానిస లబీబాయే! నదిలో కొట్టుకుపోతున్న లబీబాను ఒక పల్లెవాడు కాపాడి, బానిసగా అమ్మాడు. ఆమెను కొన్న వాడు కొంత కాలానికి ఆమెను బాగ్దాదు నగరానికి తెచ్చి, రాజభవనంలో బానిసగా అమ్మాడు.

ఈ విధంగా అబూ అల్ కాసిమ్ బస్రాకు రాజు కావటమే గాక తన ప్రియురాలిని తిరిగి పొంది, చాలా కాలం సుఖంగా జీవించాడు.





# మంచితనం

ఒక దేశంలో శేషయ్యా అనే వైద్యుడుండే వాడు. మూలికా వైద్యంతో అతను ఎలాటి గడ్డు రోగాలనూ నయం చేసేవాడు. ఆ శేషయ్యా ఉండే దేశంలో కరువు వచ్చింది. అందుచేత అతను పొరుగు దేశం వలస వచ్చి, ఒక జమీందారు గ్రామంలో చేరాడు.

శేషయ్యా ఒంటరిగాడు. అతను సుఖంగా జీవించటానికి పెద్ద సంపాదన అవసరం లేదు. అతని హస్తవాసి త్వరలోనే ప్రసిద్ధికి వచ్చింది. పక్షవాతం లగాయతు పాము కాటు వరకూ ఎలాటి రోగాన్నయినా నయం చేసేవాడు. పేదవాళ్ళ దగ్గిర డబ్బు తీసు కునేవాడు కాడు. అందుచేత శేషయ్యా పేరు ఆ చుట్టు పక్కల మారుమోగి పోయింది. అందరూ అతన్ని దేవుణ్ణి చూసి నట్టు చూసేవారు.

శేషయ్యా అతి స్వల్పకాలంలో సంపా దించుకున్న అఖండ కీర్తి చూసి ఆ వూరి జమీందారుకు ఈర్ష్య పుట్టు కొచ్చింది. ఈ శేషయ్యా వచ్చేవరకూ ఆ ప్రాంతాల వారికి జమీందారే దేవుడు. ప్రజలు ప్రతి దానికీ ఆయన పేరే తలచుకునేవాళ్ళు. కాని ఇప్పుడు శేషయ్యా పేరు ముందు జమీందారు పేరు తుడిచి పెట్టుకు పోయింది. ముఖ్యంగా పేద రైతులకు జమీందారు ఏనాడూ ఎలాటి సహాయమూ చేయలేదు.

కాని శేషయ్యా పేరు చెరిపెయ్యటం ఎలాగో జమీందారుకు తోచలేదు. అతన్ని ఊరి నుంచి వెళ్ళగొట్టాలి, లేదా అతను వైద్యం చెయ్యకుండా చేయాలి. మొదటిది తన చేతిలో పనేగాని, తనకు అపఖ్యాతి చుట్టుకుంటుంది. రెండోది చాలా కష్టంతో కూడిన పని. దానికి సమయం కలిసి రావాలి.

ఒక రోజు జమీందారుకు శేషయ్యా, సంచికట్టు చేత బట్టుకుని పోతూ కని పించాడు.

బి. వెంకటేశ్వరరావు

"ఎక్కడికి, శేషయ్యా?" అని జమీం దారు అడిగాడు.

"పక్క గ్రామం వాళ్ళు వైద్యానికి పిలి చారండి. మళ్ళీ రేపు తిరిగి వచ్చేస్తాను," అని చెప్పి శేషయ్య వెళ్ళిపోయాడు.

శేషయ్య వైద్యం చెయ్యకుండా చెయ్య టానికి జమీందారుకు మంచి అవకాశం దొరికింది. ఆ రాత్రి జమీందారు తన నౌకర్ల చేత శేషయ్య ఇంటికి కన్నం వేయించి, శేషయ్య మందు సీసాలన్నీ పగలగొట్టించి, మందులన్నీ చెత్తకుప్పలో పారేయించి, ఆయన దాచుకున్న మూలికల కట్టలన్నీ తగల బెట్టించేశాడు. శేషయ్య ఇంట ఎవరూ లేకపోవటం చేత జమీందారుగారి ప్రయత్నం నిర్విఘ్నంగా సాగిపోయింది.

మర్నాడు శేషయ్య తిరిగి వచ్చేసరికి జనం ఆయన కోసం కాచుకుని ఉన్నారు. శేషయ్య తాళం తీసి లోపల ప్రవేశించి, తన మందులన్నీ ధ్వంసం అయినట్టు తెలుసుకున్నాడు. గోడలో కన్నం కని పించింది.

"ఈ కన్నం వేసినవాడు ఎటువంటి దొంగ అయి ఉంటాడు? వాడు తనకు పనికి వచ్చే వస్తువు లేవో పట్టుకుపోక ఊళ్ళో వాళ్ళకు ఉపయోగించే మందు లెందుకు నాశనం చేస్తాడు? వాడికి నా మీద ద్వేషం ఉండి ఈ పని చేశాడు. నే నెవరి



కంత ద్రోహం చేసి ఉంటాను?" అని శేషయ్య ఎంతగానో విచారించాడు. ఎన్నాళ్లో శ్రమపడి తయారు చేసిన అపురూపమైన మందులు కూడా పోయాయి.

వైద్యం కోసం వచ్చినవాళ్ళు శేషయ్యకు సానుభూతి చూపి, దొంగను నానా తిట్లూ తిట్టారు. జమీందారు మాత్రం విజయ గర్వంతో తృప్తిగా ఉన్నాడు.

ఇంతలో జమీందారు కూలీలు జమీం దారు కొడుకును మోస్తూ తీసుకు వచ్చి, "బాబుగారూ, అబ్బాయిగారిని పొలంలో ఏదో విషపుపురుగు కరిచింది. స్పృహ తప్పి పడిపోయారు. చాలా ప్రమాదం, బాబూ!" అన్నారు.

"పక్కనే శేషయ్య ఉన్నాడు గదా. అక్కడికి తీసుకుపొండి," అన్నారు అక్కడ ఉన్న గ్రామస్థులు.

అందరూ కలిసి శేషయ్య ఇంటికి పరిగెత్తారు. జమీందారు కూడా వెళ్ళి, "శేషయ్యా, నా కొడుకును పాము కరిచింది. వాణ్ణి బతికించు," అని ప్రాధేయపడ్డాడు.

"ఏం చేసేది, బాబుగారూ! నిన్న రాత్రి ఎవరో దుర్మార్గులు నా ఇంటికి కన్నం వేసి నా మందులన్నీ నాశనం చేశారు," అన్నాడు శేషయ్య.

జమీందారుకు వెన్ను మీద చరిచినట్టయింది. "ఆ పాడు పని చేయించినది నేనే, శేషయ్యా! నన్ను క్షమించి, ఏదో విధంగా నా కొడుకు ప్రాణం కాపాడు," అంటూ జమీందారు బావురుమన్నాడు.

"ఇప్పుడే వస్తాను," అంటూ శేషయ్య బయటికి పరిగెత్తాడు.

"ఇంత జరిగాక ఆ శేషయ్య ఇంకెందుకు వస్తాడూ?" అన్నారు ఒకరు.

"నా కొడుకును నా చేతులారా చంపుకున్నాను," అని జమీందారు ఏడవసాగాడు.

కాని శేషయ్య కొద్ది సేపట్లో, ఏవో మూలికలతో తిరిగి వచ్చాడు. అతను ఆ మూలికలు గబగబా నూరి, పసరు పిండి, దాన్ని జమీందారు కొడుకు ముక్కుల్లోనూ, కళ్ళల్లోనూ పోశాడు. చాలా సేపటికి జమీందారు కొడుకు కదిలాడు. తరవాత కొద్ది సేపట్లోనే వాడు లేచి కూర్చున్నాడు.

అందరికీ ఎప్పటిలాగా తిరిగి ఊపిరి ఆడసాగింది.

తరవాత జమీందారు తన బుద్ధి పూర్తిగా మార్చుకుని, శేషయ్యకు పరిహారం కింద బోలెడంత డబ్బు ఇవ్వటమేగాక, మందులు చెయ్యటానికి తన మనుషులను సహాయం ఇచ్చి, అన్ని విధాలా సహాయపడ్డాడు. శేషయ్య ఆ గ్రామంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, పెళ్ళి చేసుకుని, ఒక ఇంటి వాడైనాడు. శేషయ్య కారణంగా జమీందారు కూడా మంచి వాడయాడని అందరూ అనుకున్నారు.






# వింత వీలునామా

శీలాదిత్య మహారాజు చాలా గొప్ప రాజు. ఆయనకు ఇద్దరు భార్య లుండేవారు. వారు కవలు. రాజు వారిద్దరికీ సమాన మైన హోదా ఇచ్చే షరతు పైన వారాయ నను పెళ్ళాడారు. ఇద్దరూ ఒకే ఘడియలో మగబిడ్డలను ప్రసవించి, చనిపోయారు.

శీలాదిత్యుడి కొడుకులు దేవాదిత్యుడు, సురాదిత్యుడు అనేవాళ్ళు. తల్లిలేని ఆ పిల్ల లకు ఒక్క క్షణం పడేది కాదు. వారిలో సురాదిత్యుడు కొంచెం సరళస్వభావుడు, దేవాదిత్యుడు పరుషస్వభావుడు. వారిద్దరూ ఇంకా యుక్తవయస్కులు కాక పూర్వమే శీలాదిత్యుడు ఆకస్మికంగా అకాలమరణం వాతపడ్డాడు. అందువల్ల మంత్రి అయిన నయపాలుడి వద్ద రాజుగారి మరణశాసనం లాటిది ఏదీ లేదు.

రాజకుమారులు యుక్తవయస్కు లయే దాకా రాజ్యపాలన మంత్రి అయిన నయపాలుడి చేతిలోనే ఉంటుంది; అయినా రాజ్యం భవిష్యత్తు గురించి సభాప్రముఖు లకు తీరనివిచారం పట్టుకున్నది. ఎందు చేతనంటే, రాజకుమారు లిద్దరూ రాజ్యం కోసం తగువు పెడతారు. వారిద్దరి తల్లులూ పట్టపురాణులే.

రాజ్యాన్ని ఇద్దరు రాజకుమారులకూ పంచటంకూడా ఎంత మాత్రమూ మంచిది కాదు. ఏ పరిస్థితులలోనూ రాజ్యాన్ని విభ జించరాదని శీలాదిత్యుడి మూలపురుషుణ్ణి మహాకాళి ఆజ్ఞాపించిందని చెప్పుకునేవారు; అలా చీల్చితే రాజవంశం నిర్మూలమై పోతుందట.

కాలం గడిచింది. రాజకుమారులు యుక్తవయస్కు లయారు. సింహాసనం తనకే చెందాలని ఇద్దరూ పట్టుబట్టారు.

ఈ పరిస్థితిలో ప్రధానమంత్రి అయిన నయపాలుడు తన సమస్యను ఆస్థాన

ఎ. సి. సర్కార్, ఇంద్రజాలికుఏ



ఐంద్రజాలికుడైన మాయాపాలుడితో చెప్పు కున్నాడు.

మాయాపాలుడు అంతా విని, "రాజు గారి మరణశాసనం మాట ఏమో గాని, తన కుమార్ల మధ్య తగాదాలు వస్తే వాటిని పరిష్కరించటానికి గాను ఏవో పత్రాలు తయారు చేసి ఒక పెట్టెలో పెట్టి, ఏనాడో నా వద్ద ఉంచారు. కావలిస్తే ఆ పెట్టె తెరిచి మీ సమస్య పరిష్కార మవు తుందేమో చూడండి," అన్నాడు.

మర్నాడు నిండుసభలో ప్రధానమంత్రి ఆ పెట్టెను సభాసదుల సమక్షంలో తెరిచి, అందులో వున్న వస్తువులను పైకి తీశాడు. వాటిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఎందుకంటే ఆ పెట్టెలో ఉన్నవి మూడు కాగితపు వలయాలు మాత్రమే. వాటి మీద 1, 2, 3 అని సంఖ్య లున్నాయి. వాటిని ఏమి చెయ్యవలసినదీ మరొక కాగితం మీద రాసి ఉన్నది:

"ఈ మొదటి సంఖ్య గల వలయాన్ని దేవాదిత్యుడికి ఇవ్వవలెను. ఇది నా రాజ్యా నికి, ధనానికీ చిహ్నము. దీనిని నయ పాలుడు అర్థమంగా కత్తిరింపించి, రెండు వలయాలుగా చేసి చూడవలెను."

దేవాదిత్యుడు కత్తెర తీసుకుని వల యాన్ని అడ్డంగా కత్తిరించాడు. అది రెండు విడి వలయాలుగా తయారయింది.

తరవాత నయపాలుడు రెండవ సంఖ్య గల వలయాన్ని సూర్యాదిత్యుడికి ఇచ్చి, అతన్ని కూడా ఆ వలయాన్ని అడ్డంగా కత్తిరించమని, కాగితంలో నుంచి ఇలా చదివాడు: "నా రాజ్యం ఇలా ఉండా లని నా కోరిక."

సూర్యాదిత్యుడు రెండవ వలయాన్ని అడ్డంగా కత్తిరించే సరికి రెండు విడి వల యాలు ఏర్పడటానికి మారుగా ఒకే పెద్ద వలయం ఏర్పడింది.

నయపాలుడు ఇప్పుడు మూడవ సంఖ్య గల కాగితం వలయాన్ని దేవాదిత్యుడికి ఇస్తూ, "దీన్ని అడ్డంగా కత్తిరించినట్టయితే నా కొడుకులు ఎలా ఉండాలనీ, నా రాజ్యాన్ని

వారు ఎలా పాలించాలనీ నేను కోరుకుంటానో తెలుస్తుంది," అని చెప్పాడు.

దేవాదిత్యుడు ఈ మూడవ వలయాన్ని అడ్డంగా కత్తిరించే సరికి రెండు వలయాలు ఏర్పడ్డాయి గాని, ఒక వలయంలో రెండవది ఉండి పోయి, విడిగా రాలేదు.

ఆ వలయాలు మహారాజు శాసనమేనని అందరికీ అర్థమయింది. దేవాదిత్యుడూ, సురాదిత్యుడూ తమ తండ్రి కోరికను శిరసా వహించ నిర్ణయించుకుని, స్నేహపూర్వకంగా ఆలింగనం చేసుకున్నారు. రాజ్య పాలన విషయమై ఇద్దరూ సమమైన బాధ్యత వహించి, సమర్థతతో పాలించారు.

అమిత గడ్డు సమస్యగా కనిపించినది సుఖంగా పరిష్కారం కావటంతో అందరికీ బరువు దిగిపోయినట్లయింది. సభ జరిగిన రాత్రి విందు జరిగింది. ఆ విందు నుంచి తిరిగి వెళ్ళేటప్పుడు నయపాలుడు మాయాపాలుడితో, "రాజుగారు ఇంద్రజాలం ప్రయోగించారే. వారికి మీరే ఈ విద్య నేర్పారా?" అన్నాడు.

"అవును. వారు చనిపోయే ముందు నా దగ్గిర కొన్ని ఇంద్రజాల విద్యలు నేర్చుకున్నారు. ఈ వలయాల ఇంద్రజాలం నేను చూపిస్తాను. మీకు తీరికగా ఉన్నప్పుడు, బెత్తెడు వెడల్పూ, మూడు మూరల నిడివీ గల కాగితం ముక్కలు మూడు తీసుకుని మా యింటికి రండి," అన్నాడు.

వీలు చూసుకుని నయపాలుడు మాయాపాలుడి ఇంటికి కాగితం ముక్కలతో వెళ్ళాడు. మాయాపాలుడు మొదటి కాగితం చివరలు అంటించి వలయం తయారు చేశాడు. రెండవదాని చివరలు అంటించే ముందు కాగితానికి ఒక మెలిక పెట్టాడు. మూడవదానికి రెండు మెలికలు పెట్టి, దాని చివరలు అంటించాడు. (దిగువ బొమ్మ)

నయపాలుడు కత్తెరతో ఆ వలయాలను అడ్డంగా కత్తిరించే సరికి మొదటిది రెండు విడి వలయాలయింది; రెండవది ఒకే పెద్ద వలయమయింది; మూడవది, రెండు వలయాలు అయింది గాని, ఒక వలయంలో మరొకటి చిక్కుకుపోయింది.





# పంచకల్యాణి

## 3

శ్యామల నగరం రాజు అడిగిన దానికి వీర దాసు ఇలా చెప్పసాగాడు:

నేను కాస్త పెరిగాక, ఒకనాడు సముద్ర తీరాన కొండల్లో వేటాడబోయాను. ఒక నిటారుకొండ ఎక్కుతూండగా, దాని వెనక నుంచి పొగ పైకి లేస్తూ కనబడింది. ఆ పొగకు కారణం తెలుసుకుందామని కొండ చివరకు ఎక్కాను. ఒక కనుమ లోంచి ఆ పొగ వస్తున్నది. కనుమలోకి తొంగి చూసే సరికి, పొగకు ఊపిరిసలపక తల తిరిగి పోయింది. నేను ఆ కనుమలోకి దొర్లి పోయాను. అదృష్టవశాన దెబ్బలు బలంగా తగలలేదు. కాని ఆ కనుమ నుంచి ఎలా బయటపడాలో తెలియలేదు. ఎందుకంటే, కిందికి దొర్లిన కొండను ఎక్కడం నాకు సాధ్యంగా కనిపించలేదు. నేను తల ఎత్తి పైకె చూశానుగాని, పక్కలకు చూడనేలేదు.

ఇంతలో ఒక పక్క నుంచి ఏదో చప్పుడు వినిపించింది. అటు చూతును గదా ఒక రాక్షసుడు ఇరవై మేకలనూ, ఒక లేడినీ తోలుకుంటూ వస్తున్నాడు. వాడు వాటిని అన్నిటినీ ఒక గుహలోకి తోలి, నా దగ్గరికి వస్తూ, "వచ్చావా? నీ కోసం కత్తి నూరి ఉంచాను," అన్నాడు.

"ఛీ, ఛీ! నేననగా ఎంత? నీకు ఒక పంటి కిందికి చాలను. అయితే నీ కన్ను ఒకటి పోయినట్టున్నది. నేను కంటివైద్యంలో నిపుణుణ్ణి. పోయిన నీ కన్ను తెప్పిస్తాను," అన్నాను.

వాడు సరే నన్నాడు. నేను వాడి చేత గంగాళంలో నీరు కాగబెట్టించి, అందులో వాణ్ణి కూచోమని, గుప్పెడు గడ్డిమొక్కలు తెచ్చి, వాడి కళ్ళకు పట్టి వేస్తున్నట్టు వేస్తూ, వాడి మంచి కన్ను కూడా పొడిచేశాను.

---

టి. వెంకటరావు



నేను తనను గుడ్డివాణ్ణి చేశానని గ్రహించగానే వాడు గంగాళంలో నుంచి ఒక్క దూకు దూకి, వెళ్ళి గుహ ద్వారానికి అడ్డంగా కూర్చున్నాడు. అక్కడ కూర్చుని వాడు నన్ను రకరకాలుగా తిట్టసాగాడు.

నేను ఆ రాత్రి అంతా గుహగోడను కరుచుకుని కూర్చున్నాను. గట్టిగా ఊపిరి తీస్తే వాడికి నా జాడ తెలిసిపోతుందని ఎంతో భయపడ్డాను.

తెల్లవారి పక్షుల కలకలం వినిపించగానే ఆ రాక్షసుడు నాతో, "నిద్రపోతున్నావా? నా మేకలను విప్పు" అన్నాడు.

నేను నా వేట కత్తితో వాడి లేడిని చంపి, దానితోలు ఒలవటం మొదలు పెట్టాను.

"ఏం చేస్తున్నావు?" అన్నాడు రాకసుడు.

"ముడులు ఒకంతట రావటం లేదు, చాలా గట్టిగా ఉన్నాయి," అన్నాను.

తరవాత ఒక్కొక్క మేకనే వదిలాను. రాక్షసుడు ఒక్కొక్క మేకనే తడివి గుర్తు పట్టుతూ, "తెల్లమేకా, నిన్ను నేను చూడ లేను గాని, నన్ను నువు చూడగలవు గద!" అంటూ ప్రతి మేకనూ పేరుపేరునా పలక రించి బయటికి పోనిచ్చాడు.

చివరకు లేడితోలు కప్పుకుని పాకు కుంటూ నేను బయటికి బయలుదేరాను. రాక్షసుడు లేడిచర్మం మీద నిమిరి, "అయ్యో. నా లేడీ, నేను నిన్నుచూడలేను గాని నువు నన్ను చూడగలవు గద!" అంటూ నన్ను బయటికి పోనిచ్చాడు. గుహ దాటి రాగానే నాకు ఆకాశమూ, సముద్రమూ, ఎండా కనిపించి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

ఆ ఆనందంలో, "ఒరే, గుడ్డివెధవా! నన్ను పట్టుకోలేక పోయావు!" అని కేకలు పెట్టాను.

రాక్షసుడు నా కేకవిని, "ఎంత మొన గాడివిరా! మెచ్చుకున్నాను. నా జ్ఞాపకార్థం ఈ ఉంగరం తీసుకో!" అని పిలిచాడు.

"నేను ఉంగరం కోసం నీ దగ్గిరికిరాను. దాన్ని నా కేసి విసురు," అన్నాను.

రాక్షసుడు ఒక ఉంగరాన్ని నా దిక్కుగా విసిరాడు. నేను దాన్ని నా వేలికి తగిలించు

కున్నాను. "ఉంగరం నీ వేలికి సరి పోయిందా?" అని రాక్షసుడు అడిగాడు.

"చక్కగా సరిపోయింది," అన్నాను.

రాక్షసుడు పెద్దగా నవ్వి, "ఉంగరమా ఎక్కడ ఉన్నావు?" అని కేక పెట్టాడు.

"ఇక్కడే ఉన్నాను!" అని నా వేలి ఉంగరం జవాబిచ్చింది.

దాని ధ్వనిని బట్టి రాక్షసుడు నా కేసి రాసాగాడు. నాకు పెద్ద ప్రమాదం దాపరించింది. ఉంగరం తీద్దామంటే ఒకంతట వచ్చేటట్టు కనబడలేదు. నా కత్తితో ఉంగరం వేలు కోసేసి, ఉంగరంతో సహా దాన్ని దూరంగా సముద్రపు అగాధంలోకి విసిరేశాను.

ఈ లోపల రాక్షసుడు ఉంగరాన్ని, "ఎక్కడ వున్నావు?" అని అడుగుతూ ముందుకు వస్తున్నాడు. ఉంగరం సముద్రంలో నుంచి, "ఇక్కడే వున్నాను," అని జవాబిచ్చింది. రాక్షసుడు సముద్రంలోకి పరిగెత్తుకుంటూ వెళ్ళి, అగాధంలో పడి, మునిగి చచ్చిపోయాడు.

తరవాత నేను రాక్షసుడి గుహకు తిరిగి వెళ్ళి, అక్కడ ఉన్నదంతా కొల్లగొట్టి, ఎలాగో ఇల్లు చేరుకున్నాను.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "ఆ నాడు నా కెదురైన ప్రమాదం చాలా గొప్పది. నా ఉంగరం వేలు పోయిందే గాని నాకు మరే అపాయమూ కలగలేదు," అంటూ తన చెయ్యి ఎత్తి చూపాడు. ఆ చేతికి ఉంగరంవేలు లేదు.

శ్యామలనగర రాజు అతని కథ విని, "నీ కథ అద్భుతంగా ఉన్నది. అది నిజమని నాకు నమ్మకం కుదిరింది. నీ కథలతో ఇద్దరు కొడుకులను కాపాడుకున్నావు. అలాటి కథ మరొకటి ఉంటే చెప్పి నీ మూడో కొడుకు ప్రాణాలు కూడా కాపాడుకో," అన్నాడు.

వీరదాసు కొంచెం ఆలోచించి, "నా జీవితంలో ఇంతకన్న కూడా ప్రమాదకరమైన సంఘటన జరిగింది," అన్నాడు.

"అయితే చెప్పు!" అన్నాడు రాజు.

—[పై సంచికలో మరొక కథ]






శివుడి దర్శనం చేసుకోమని సలహా చెప్పి ఇంద్రుడు అదృశ్యం కాగానే అర్జునుడు శివుణ్ణి ఆరాధించ నిశ్చయించుకుని ముందుకు సాగాడు. అతనికి అమితమనో హరమైన వనం ఒకటి తగిలింది. అందు లోని చెట్లు చాలా అందంగా ఉన్నాయి. పూలనుంచి సువాసనలు వస్తున్నాయి. శివుణ్ణి గురించి తపస్సు చెయ్యటానికి అది చాలా అనుకూలమైన ప్రదేశంగా అర్జునుడికి తోచింది.

అర్జునుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, నాలుగు నెలలపాటు శివుణ్ణి గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. అతని నుంచి దారుణమైన వేడి పుట్టి, వనమంతా పొగ చుట్టవేసింది. అది చూసి ఆ వనంలో ఉండే ఋషులు శివుడి వద్దకు వెళ్ళి, అర్జునుడి కోరిక తీర్చి, అతని తపస్సు మాన్పించమని బతిమాలుకున్నారు. శివుడు వారితో, అర్జునుడి కోరిక తీర్చబోతున్నాననీ, భయపడ వద్దనీ చెప్పి పంపేశాడు.

ఋషులు వెళ్ళిపోగానే శివుడు కిరాతుడి వేషం ధరించాడు. పార్వతీ, ప్రమథులూ అతని అనుచరులకు తగిన వేషాలు ధరించారు. అందరూ కలిసి, అర్జునుడు తపస్సు చేసుకునే వనంలో విహరించసాగారు.

ఇదే సమయంలో మూకుడు అనే రాక్షసుడు పంది రూపంలో అర్జునుడి మీదికి చంపటానికి వచ్చాడు. తపస్సు చేసుకునే అర్జునుడు విల్లూ, బాణాలూ తీసుకుని ఆ పందిని చంపబోయాడు.

29. ఊర్వశీశాపం



ఇంతలో, కిరాతుడి రూపంలో ఉన్న శివుడు అర్జునుడితో, "ఒరే, ఆ పందిని నేను కొడతాను, నువు కొట్టకు!" అన్నాడు.

అర్జునుడు ఆ మాట లక్ష్యపెట్టక, పందిని బాణంతో కొట్టాడు. కిరాతుడు కూడా దాన్ని తన బాణాలతో కొట్టాడు. ఇద్దరి బాణాలూ తగిలి, ఆ రాక్షసుడు నిజ స్వరూపంతో బయటపడి చచ్చాడు.

అప్పుడు అర్జునుడు కిరాతుడితో, "ఎవరు నువు? నిర్జనమైన ఈ వనంలో ఆడదాన్ని వెంట బెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు? నన్ను చంపటానికి వచ్చిన ఈ రాక్షసుణ్ణి నేను కొట్టుతుంటే, నాతో సమంగా నువు కూడా ఎందుకు బాణాలు వేశావు? ఇది వేటగాడి ధర్మం కాదు. ఇలా చేసినందుకు నేను నిన్ను చంపేస్తాను!" అన్నాడు.

కిరాత వేషంలో ఉన్న శివుడు అర్జునుడి మాటలకు నవ్వి, "నేను ఆడవాళ్ళను వెంట వేసుకు తిరుగుతున్నానని నీ కెందుకు విచారం? ఇది మా ఆటవికుల ధర్మం. నిర్జనమైన ఈ అరణ్యంలో నువ్వెందు కున్నావు? నువు చూడబోతే నాగరికుడవు గానూ, సుకుమారంగానూ ఉన్నావు. ఈ పంది మాటంటావా? దాన్ని ముందు కొట్టిన వాణ్ణి నేను. నేను కొట్టిన పందినే నువు కొట్టావు. బలమున్నదిగదా అన్న పొగరుతో నన్ను తప్పు పట్టుతున్నావు. అంత బల వంతుడవైతే నాతో యుద్ధానికి రా!" అంటూ అర్జునుణ్ణి రెచ్చగొట్టాడు.

అర్జునుడు అలిగి కిరాతుడి మీద వరసగా బాణాలు వేశాడు. కాని కిరాతుడు వాటిని లక్ష్యపెట్టక, "ఇవేం బాణాలు? ఇంతకన్న మంచి బాణాలు లేవా? ఇంతకన్న బాగా యుద్ధం చెయ్యలేవా?" అన్నాడు.

అమోఘమైన తన అస్త్రాలను లక్ష్య పెట్టని ఈ కిరాతుడు మాయా వేషంలో ఉన్న మహనీయు డెవడో అయి ఉంటాడని అర్జునుడికి అనుమానం కలిగింది. మామూలు కిరాతుడైతే ఎప్పుడో పోయి ఉండేవాడు. ఏమయినా అర్జునుడు వెనకాడ కుండా కిరాతుడి పైన బాణ వర్షం కురి

పించాడు. కొద్ది సేపట్లోనే అక్షయతూణీ రాలు ఖాళీ అయిపోయాయి!

అగ్నిదేవుడు ప్రసాదించిన అక్షయ తూణీ రాలు ఖాళీ అయిపోవటం అర్జునుడి అను మానాన్ని మరింత చేసింది. అయినప్పటికీ అతను వెనకాడక తన గాండీవం మొనతో ఆ కిరాతుణ్ణి పొడిచి చంపబోయాడు. మరు క్షణం గాండీవం మాయమయిపోయింది! దాన్ని కూడా లక్ష్యపెట్టక అర్జునుడు కత్తి దూసి దానితో కిరాతుణ్ణి కొట్టాడు. కత్తి ముక్కలు ముక్కలై కింద పడింది.

అర్జును డిప్పుడు నిరాయుధుడు. అతను కిరాతుడి పైన చెట్ల కొమ్మలు విసిరాడు, రాళ్ళు రువ్వాడు. అర్జునుడు ఏది ప్రయో గించినా కిరాతుడు మటుకు చలించ లేదు. అప్పుడు అర్జునుడు కిరాతుడిపై కలియబడి, పిడికిళ్ళతో కొట్టసాగాడు. కిరాతుడు కూడా అర్జునుణ్ణి పిడికిళ్ళతో పొడిచాడు.

కిరాతుడి దెబ్బలకు అర్జునుడికి స్పృహ తప్పింది. అతను స్పృహ తెలిసి లేస్తూనే స్నానం చేసి, మట్టితో చేసిన శివలింగం మీద పూలగుత్తి ఉంచి, కొంచెం సేపు ధ్యానించి, లేచి కిరాతుడి కేసి చూసేసరికి, లింగం మీద తానుంచిన పూలగుత్తి కిరాతుడి నెత్తిన కనిపించింది.

ఇది చూడగానే అర్జునుడికి మొదట ఆశ్చర్యమూ, తరవాత సంతోషమూ కలి



గాయి. తాను ఇంతసేపూ యుద్ధం చేసిన కిరాతుడు శివుడేనని గ్రహించి, అర్జునుడు సాష్టాంగపడి, స్తోత్రం చేశాడు.

అప్పుడు శివుడు అతని భక్తికి మెచ్చు కుని, "అర్జునా, నీ వంటి శూరుడు మూడు లోకాలలోనూ మరొకడు లేడు. నీ భక్తికి మెచ్చాను. తేజస్సులో నువు నా అంత వాడివి. నా దివ్యాస్త్రాన్ని నీ కిస్తాను. దాన్ని ప్రయోగించటానికైనా, స్వీకరించటాని కైనా నువు అర్హుడివి. దాని మహిమతో నువు శత్రువులను జయిస్తావు." అని చెప్పి అర్జునుడికి దర్శన మిచ్చాడు.

అర్జునుడు శివుడి కాళ్ళపైన పడి తన అజ్ఞానాన్ని క్షమించ మని వేడుకున్నాడు.



శివుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, అతని చెయ్యి పట్టుకుని, "అర్జునా, పూర్వజన్మలో నువు నరుడనే ఋషివి. అనేక వేల సంవత్సరాలపాటు నువూ, నారాయణుడనే ఋషీ బదరికాశ్రమంలో తపస్సు చేశారు. మీ రిద్దరూ అనేక మంది దుష్టరాక్షసులను చంపి, దేవేంద్రుడి పదవి నిలబెట్టారు. అప్పుడు నీ చేత ఉండిన ధనుస్సే ఇప్పుడు మళ్ళీ నీ వద్ద ఉన్నది. నా మాయచేతనే నీ గాండీవమూ, అక్షయ తూణీరాలూ మాయమయాయి. నీ కోరిక లేమిటో చెప్పు, తీర్చుతాను," అన్నాడు.

"మహేశ్వరా, నాకు భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనులతో యుద్ధం కలగబోతుంది. ఆ మహావీరులను జయించటానికి గాను నాకు పాశుపతాస్త్రమూ, బ్రహ్మశిరోనామాస్త్రమూ కావాలి. వాటిని నాకు అనుగ్రహించు," అని అర్జునుడు అన్నాడు.

శివుడు అర్జునుడికి పాశుపతాస్త్రం ప్రయోగమూ, ఉపసంహారమూ ఎలా చెయ్యాలో మంత్రసహితంగా తెలిపాడు. గాండీవమూ, అక్షయ తూణీరాలూ అతనికి తిరిగి లభించాయి. శివుడు పార్వతితో సహా అదృశ్యమయాడు.

అర్జునుడికి ఎక్కడ లేని శక్తి వచ్చినట్టయింది. తనకు అపూర్వమైన పాశుపతాస్త్రం లభించింది, ఈశ్వర దర్శనం లభించింది. ఈశ్వరుడి స్పర్శచే తన శరీరం పవిత్రమయింది.

అంతలో, లోకపాలకులైన ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు తమ భార్యలతోసహా, అర్జునుడు ఉన్నచోటికి వచ్చి, తమ అస్త్రాలు అతనికిచ్చారు. ఇంద్రుడు మాత్రం అర్జునుణ్ణి స్వర్గానికి ఆహ్వానించి, అక్కడ అతనికి దివ్యాస్త్రాలు ఇస్తానన్నాడు.

మరి కొంత సేపటికి అర్జునుడి కోసం ఇంద్రుడి రథం వచ్చింది. దానికి సారథి అయిన మాతలి, "అర్జునా, నీ కోసం ఇంద్రుడు ఈ రథం పంపాడు. ఆయన దేవతలతోనూ, గంధర్వులతోనూ, ఋషులతోనూ, అప్సరసలతోనూ కొలువు దీరి,

నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు." అన్నాడు.

ఇంద్రుడి రథం ఎక్కటంమాట అటుంచి, తాకటానికైనా, తనకు అర్హత లేదేమోనని అర్జునుడికి అనిపించింది. అయినా, ఇంద్రుడి అనుజ్ఞ అయింది గనుక ఎక్క దలచి, ముందు మాతలిని ఎక్కమని, తర వాత తాను రథం ఎక్కాడు.

రథం ఆకాశంలోకి లేచి, సిద్ధమార్గాన పోసాగింది. దారిలో అర్జునుడికి కనిపించిన విమానాలలో స్వయంప్రకాశం గల రాజ ర్షులూ, యుద్ధాలలో చనిపోయిన శూరులూ, సిద్ధులూ, గంధర్వులూ, అప్సరోగణాలూ కనిపిస్తే, వారు ఎవరెవరైనదీ మాతలి అతనికి వివరించి చెప్పాడు.

కొంత సేపటికి అర్జునుడికి అమరావతీ నగరం అంత దూరాన కానవచ్చింది. దాని వెలుపలి ద్వారం మీద ఎత్తయిన గోపురం ఉన్నది. అది చూస్తేనే అర్జునుడికి పరమా నందమయింది. నగరంలోపల నందన వనంలో అప్సరలు విహరిస్తున్నారు.

అర్జునుడి రథం అమరావతీ నగరం ప్రవేశించగానే దేవతలు ఇంద్రుడి అజ్ఞపై అతనికి ఎదురు వచ్చారు. గంధర్వులూ, సిద్ధులూ, అప్సరలూ అతనికి మంగళోప చారాలు చేశారు. నారదుడు మొదలుగా గల దేవర్షులు అర్జునుణ్ణి ఆశీర్వదించారు.




అర్జునుడు మొగసాల వద్ద రథం దిగి, ప్రాకారాలుదాటి, దేవేంద్రుడి సుధర్మ అనే సభ ప్రవేశించాడు.

అక్కడ దేవేంద్రుడు నిండు కొలువులో ఉన్నాడు. ఆయన చుట్టూ గంధర్వులు స్తోత్రపాఠాలు చేస్తున్నారు. వేదఘోష వినిపిస్తున్నది; సిద్ధ, చారణ, మరుత్తులూ, విశ్వేదేవతలూ, అశ్వినులూ, ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ, బ్రహ్మర్షులూ, రాజర్షులూ ఉన్నారు. ఇంద్రుడి పైన తెల్లని గొడుగున్నది. ఆయనకు వింజామరలు వీస్తున్నారు.

అర్జునుడు ఇంద్రుడి వద్దకు వెళ్ళి ప్రణామం చేశాడు. ఇంద్రుడు అతన్ని కౌగ



లించుకుంటూ లేవదీసి, తన సింహాసనం మీద తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు. ఆయన తన కొడుకైన అర్జునుడి కేసి మళ్ళీ మళ్ళీ చూస్తూ ఎంతో మురిసిపోయాడు. నారదుడు వీణవాయించాడు, తుంబురుడు పాడాడు; అప్సరసలు నృత్యాలు చేశారు.

తరవాత దేవతలు ఇంద్రుడి ఆజ్ఞపైన అర్జునుడికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి, అందమైన విడిదిగృహానికి అతన్ని తీసుకుపోయారు. అర్జునుడు స్వర్గంలో చాలాకాలం ఉండి, దేవతాస్త్రాల ప్రయోగ, ఉపసంహారాలు పూర్తిగా గ్రహించాడు.

ఆ సమయంలో ఇంద్రుడు అర్జునుడికి చిత్రసేను డనే గంధర్వుడి చేత దేవతల సంగీతమూ, నృత్యమూ నేర్పించాడు. అర్జునుడికి స్వర్గంలో ఉన్నా, అరణ్యవాసం చేసే తనవాళ్ళూ, తనకు దూరమైపోయిన తల్లీ జ్ఞాపకంవచ్చి మనసు ఎంతో బాధపడేది.

అర్జునుడికి ఊర్వశిపైన మనసు కలిగిందని ఇంద్రుడు అపోహపడి, చిత్రసేనుణ్ణి పిలిచి, "అర్జునుడి కోరిక తీర్చమని ఊర్వశితో నా మాటగా చెప్పు," అన్నాడు. అలాగే చిత్రసేనుడు ఊర్వశితో చెప్పాడు. ఊర్వశికి అదివరకే అర్జునుడిపైన మోహం కలిగి ఉన్నది. అందు చేత ఆమె ఇంద్రుడి ఆజ్ఞ పాలించటానికి ఒప్పుకుని, ఒక నిండువెన్నెల రాత్రి అర్జునుడి విడిదికి వెళ్ళింది.

అద్భుతంగా సింగారించుకుని, సువాసనలు చిమ్ముతూ రాత్రివేళ తన విడిదికి వచ్చిన ఊర్వశిని చూసి అర్జునుడు అదిరిపడి, ఆమె పాదాలకు భక్తితో మొక్కి, "దేవీ, నీ రాకకు కారణమేమిటి? నా వల్ల ఏమి కావాలి?" అని అడిగాడు.

ఊర్వశి తాను వచ్చినపని చెప్పింది.

అర్జునుడు హరిహరీ అని చెవులు మూసుకుని, "అమ్మా, నువు నాకు కుంతీదేవి వంటి దానివి, శచీదేవి వంటి దానివి. మా మూలపురుషుడైన పురూరవుడికి భార్యవు. నేను నిన్ను తల్లిగానే భావిస్తున్నాను," అన్నాడు.

దానికి ఊర్వశి, ''అర్జునా, ఈ దేవలోకంలో మా పద్ధతులు వేరు. మీ భూలోకంలో ఉన్నట్టుగా మాకిక్కడ వావివరసలు లేవు. అందుచేత లేనిపోని అనుమానాలు పెట్టుకోక నాతో సుఖించు.'' అన్నది.

అర్జునుడు ఆమెతో, ''అమ్మా, మీరు దేవతలు. మీరు ఏది చేసినా తప్పు లేదన్న మాట నిజమే. కాని నేను మానవమాత్రుణ్ణి. అందుచేత మీరు చేసేపనులు నేను చెయ్యలేను. నువు నాకు తల్లిలాంటి దానివి. నా మీద ఇతర భావాలు పెట్టుకోక, నన్ను నీ కొడుకులాగా చూసుకో!'' అన్నాడు.

ఆశాభంగం కలగటంతో ఊర్వశికి ఆగ్రహం కలిగింది. ఆమె అర్జునుడితో, ''ఓయీ, నేను స్త్రీని. స్వేచ్ఛగలదాన్ని. నిన్ను మోహించి వస్తే, నువు నన్ను తృణీకరించావు. అందుచేత నిన్ను నపుంసకుడివి కమ్మని శపిస్తున్నాను. పేడివై, అంతఃపురంలో ఆడవాళ్ళ మధ్య ఆట పాటలతో కాలక్షేపం చేస్తూ ఉండిపోదువుగాక!'' అని శపించి, గిరుక్కున తిరిగి, వెళ్ళిపోయింది.

అర్జునుడు ఆ రాత్రి ఎలాగో గడిపి, మర్నాడు చిత్రసేనుడు రాగానే అతనితో, గడచిన రాత్రి ఊర్వశి తనవద్దకు రావటమూ, తానామె కోరికను తోసిపుచ్చటమూ, ఆమె తనను శపించి వెళ్ళిపోవటమూ వివరించి చెప్పాడు.

ఇదంతా చిత్రసేనుడి ద్వారా విని ఇంద్రుడు అర్జునుడి వద్దకు వచ్చి, ''అర్జునా, నువు నిజంగా ఇంత నిగ్రహం కలవాడివని నేను అనుకో లేదు. ఇంత నిగ్రహం గలవారు మహర్షులలో కూడా చాలా అరుదుగా ఉంటారు. ఊర్వశి శాపానికి భయపడకు. మీరు ఒక ఏడాదిపాటు అజ్ఞాతవాసం చెయ్యవలసి ఉన్నది గద. అప్పుడీ శాపాన్ని అనుభవించు. అందువల్ల నీకు మేలే అవుతుంది. ఆ ఏడాది కాగానే నీకు ఊర్వశి శాపం తీరిపోతుంది,'' అన్నాడు.

ఈ మాటలతో తృప్తి పడి అర్జునుడు చిత్రసేనుడి వెంట తిరుగుతూ స్వర్గంలో కాలం గడిపాడు.





# శివపురాణం

## 6

వజ్రాంగుడు తనకు కొడుకు కలిగేటట్టు బ్రహ్మ వల్ల వరం పొంది ఇంటికి తిరిగి వచ్చిన కొంత కాలానికి, అతని భార్య అయిన వరాంగి గర్భవతి అయి, పదవ మాసంలో ఒకనాటి తెల్లవారు ఝామున ఒక కొడుకును కన్నది. త్రిలోక శూరుడైన ఆ కొడుకు పుట్టగానే భూమి కంపించింది, అన్నివైపులా అగ్నిజ్వాలలు లేచాయి. సముద్రాలు పొంగాయి. సుడిగాలి వీచి చెట్లు విరిగి పడ్డాయి. ఇలాటి ఉత్పాతాలు ఎన్నో చూసి జనం బెదిరిపోయారు.

వజ్రాంగుడూ, వరాంగీ తమ కొడుక్కు తారకుడు అని పేరు పెట్టుకుని, ఎంతో గారాబంగా పెంచసాగారు.

తారకుడు నానాటికీ బలం పెంచుకుని, పర్వతాకారం గలిగి, చూపరులకు భయంకరుడుగా తయారయాడు.

వరాంగి ఒకనాడు తారకుడితో, "నాయనా, నువు బ్రహ్మను గురించి తపస్సు చేసి, మూడులోకాలనూ జయించేలాగా వరాలు పొందు," అని హెచ్చరించింది.

తారకుడు సరేనని, ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి, అక్కడ మహా దారుణమైన తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు మూలంగా అతనిలో పుట్టిన వేడికి మూడులోకాలూ దగ్ధమయేటట్టు కనబడింది. అప్పుడు దేవతలూ, ఋషులూ బ్రహ్మ వద్దకు వెళ్ళి, "మహానుభావా, నువు వెళ్ళి ఆ తారకుడి చేత తపస్సు మాన్పించి, లోకాలను కాపాడు," అని వేడుకున్నారు.

బ్రహ్మ సరస్వతీ సమేతుడై హంస వాహనం మీద, తారకుడి వద్దకు వచ్చి, "తారకా, నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరాలు కావాలో కోరుకో," అన్నాడు.



తారకుడు పరమానందంతో బ్రహ్మకు నమస్కారం చేసి, "ఓ బ్రహ్మదేవుడా, నువు వరాలిస్తాననగానే నా తపస్సు ఫలించింది. నాకు మూడులోకాలనూ జయించే శక్తిని ఇయ్యి. శివుడి వీర్యాన పుట్టిన వాడి వల్ల తప్ప నాకు మరెవరి వల్లా చావు లేకుండా వరమియ్యి. నాకు కావలిసినవి ఈ రెండు వరాలే!" అన్నాడు.

బ్రహ్మ తారకుడికి అతను కోరిన వరాలిచ్చి సత్యలోకానికి వెళ్ళిపోయాడు. తారకుడు తన రాజధాని అయిన శోణితపట్టణానికి తిరిగి వచ్చి, తాను బ్రహ్మ వల్ల పొందిన వరాలను గురించి తన తల్లికీ, తమ గురువైన శుక్రాచార్యుడికీ చెప్పి, త్రిలోక దిగ్విజయానికి ముహూర్తం నిర్ణయించమని చెప్పాడు.

తారకుడు లోకాలమీద దాడి బయలుదేరటానికి శుక్రాచార్యులు ముహూర్తం పెట్టాడు. తారకుడు ఆ ముహూర్తానికి చతురంగ బలాలతో స్వర్గం మీద యుద్ధానికి వెళ్ళి, దేవతలను జయించి, ఇంద్రుడి చేత కానుకలు పుచ్చుకుని, అతడి సింహాసనాన్ని స్వాధీనం చేసుకున్నాడు. తరవాత తారకుడు వరుణుడి మీదికి యుద్ధానికి వెళ్ళి, జయించి, వరుణుడి రథాశ్వాలను కానుకగా పుచ్చుకుని, తరవాత యముడి పైకి వెళ్ళాడు. క్రమంగా ఒక్కొక్క దిక్కే అతనికి ఓడింది. దిక్పాలకుల నుంచి అంతులేని కానుకలు పొంది, తారకుడు తన రాజధానికి తిరిగి వచ్చి, సుఖంగా ఉన్నాడు.

ఒకనాడు నారదుడు తారకుణ్ణి చూడ వచ్చాడు. తారకుడు ఎదురు వెళ్ళి, పూజించి, నారదుణ్ణి తీసుకు వచ్చి, తన సింహాసనం మీద కూర్చోబెట్టి, "మహాత్మా, నీ దయవల్ల దిక్కులన్నీ జయించాను!" అన్నాడు.

ఆ మాట విని నారదుడు, "తారకా, బ్రహ్మ వల్ల వరాలు పొందిన నువు పది దిక్కులూ జయించటంలో విశేషం ఏమీ లేదు. నిన్ను చంపగలవాడు కూడా ఎవడూ లేడు. ఎందు చేతనంటే, నువు శివుడి

వీర్యాన పుట్టిన వాడిచేత తప్ప చావులేకుండా కూడా వరం పొందావు. శివుడేమో వైరాగ్యంతో తపస్సు చేసుకుంటున్నాడాయె. అందు చేత నువు నిజంగా త్రిలోక శూరుడివని పేరు తెచ్చుకో గోరితే వెళ్ళి, వైకుంఠాన్ని జయించిరా!" అన్నాడు.

తారకుడు నారదుడి సలహాను పాటించి, తన సేనలతో వైకుంఠానికి బయలుదేరి వెళ్ళి, రణభేరి వేయించాడు. విష్ణువు తారకుడికి గల వరాలను తలచుకుని, అతన్ని చంపటం సాధ్యం కాదని గ్రహించి, తారకుడి వద్దకు వచ్చి, మంచి మాటలతో అతన్ని పంపివేశాడు.



అక్కడ కైలాసంలో, పార్వతి సపర్యలకు శివుడు ఒప్పుకున్నందుకు హిమవంతుడు సంతోషించి, పార్వతినీ, ఆమె చెలికత్తెలనూ తీసుకు వచ్చి, శివుడికి ప్రణామం చేయించి, శివుడితో, "ఈమె వల్ల సపర్యలు చేయించుకో. పొరపాట్లు జరిగితే క్షమించాలి," అని చెప్పి, పార్వతిని శివుడికి అప్పగించి, మేనకా సహితుడై తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

అది మొదలు పార్వతి ప్రతిరోజూ ఉదయం నుంచి మధ్యాహ్నందాకా శివుడికి పరిచర్యలు చేసి, ఆయనకు కావలసిన పూలూ, పళ్ళూ, నీరూ తెచ్చిపెట్టి, ఇంటికి వెళ్ళి, తాను శివుడికి చేసిన సేవలు ప్రతిరోజూ తన తల్లి దండ్రులకు చెబుతూ ఉండేది.

శోణితపురానికి తిరిగి వచ్చిన తారకుడు కొంతకాలం ఉండి, స్వర్గానికి సైన్యంతో సహా వెళ్ళి, దేవేంద్రుడి సింహాసనం మీద కూర్చుని, దేవతల చేత పరిచర్యలు చేయించుకుంటూ, లోకాలను బాధించసాగాడు. అతను ఋషుల యజ్ఞాలకు విఘ్నాలు కలిగించాడు; తపస్సులను సాగనివ్వలేదు.

దేవేంద్రుడు మొదలైన వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, వరాలు పొందిన గర్వంతో తారకుడు తమను పెట్టే హింసలను గురించి మొరపెట్టుకున్నారు.

బ్రహ్మ తారకుడి వద్దకు వెళ్ళి, "తారకా, నువు మూడులోకాలనూ జయించావు గద. నీ శోణితపురం నుంచే నువు లోకాలను పాలిస్తూ ఉండు. స్వర్గాన్ని దేవేంద్రుడికే ఉండనీ. నీకూ, దేవతలకూ మధ్య విరోధం దేనికి ?" అని హితం చెప్పాడు.

తారకుడు బ్రహ్మ మాట పాటించి, స్వర్గాన్ని ఇంద్రుడికి ఇచ్చేసి, తాను శోణిత పురానికి వెళ్ళి, అక్కడి నుంచే మూడు లోకాలనూ పాలించసాగాడు. అతను ఈశ్వరా రాధన చేస్తూ సుఖంగా ఉన్నాడు.

ఇంద్రుడు స్వర్గాన్ని తిరిగి పొంది కూడా, తాను మరొకడి అధికారం కింద పాలన చేయవలసి వచ్చినందుకు చాలా బాధపడి, తమ గురువైన బృహస్పతిని పిలిపించి, "గురుదేవా, త్రిలోకాధిపతి అయిన నేను తారకుడి కింద సేవకుడుగా ఉండటం చాలా అవమానకరంగా ఉన్నది. ఇలాటి అవమానంతో బతికే కన్న, చావుమేలు. దీనికి విరుగుడు తారకుడి చావే. నీకు తెలియని ఆలోచనలు ఉండబోవు. ఈ తారకుడు చచ్చేమార్గం ఏదన్నా ఉంటే ఆలోచించి చెప్పు." అన్నాడు.

"మనం బ్రహ్మనే ఆలోచన అడగటం మంచిది. తారకుడి విజృంభణకు కారకుడు ఆయనే." అన్నాడు బృహస్పతి.

అందరూ కలిసి బ్రహ్మ వద్దకు వెళ్ళి, తారకుడు చచ్చే ఉపాయం చెప్పమని ఆయనను అడిగారు.

"శివుడి వీర్యాన పుట్టినవాడి చేతిలో తప్ప తారకుడికి చావు లేదు. నేను వాడికి అలా వరం ఇచ్చాను. సతీదేవి మరణంతో విరాగి అయి శివుడు కైలాసపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సతీదేవి హిమవంతు డికి కుమార్తె అయి పుట్టి, శివుడికి పరి చర్యలు చేస్తున్నది. ఆమె తన మనసులో శివుణ్ణి తన భర్తగా కోరుకుంటున్నది. మీరు ఎలాగైనా శివుడికి పార్వతి మీద మోహం కలిగేటట్టు చేసి, వారికి వివాహం జరిపించ గలిగితే, శివపార్వతులకు పుట్టే కొడుకు తారకుణ్ణి చంపుతాడు," అని చెప్పి బ్రహ్మ దేవతలను పంపేశాడు.



# 116. ప్రాచీన లేఖకుడు

**1860** లో పురావస్తువుల సేకరణ కొరకు ఈజిప్టులో తవ్వకాలు జరుగుతూండగా ఈ అపూర్వ దారుశిల్పం బయటపడింది. ఈ ప్రతిమ "కా అపేర్" అనే ప్రాచీన లేఖకుడిదిగా గుర్తించబడింది. ఈజిప్టులో పరిపాలించిన అయిదవ రాజవంశం కాలంలో—సుమారు 4,500 ఏళ్ళ క్రితం—"కా అపేర్" జీవించాడు. ప్రతిమ కనుగుడ్లకు స్ఫటికమూ, కనురెప్పలకు రాగిరేకూ ఉపయోగించారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆడబోయిన తీర్థం

పంపినవారు :
ఆర్. వి. రఘునాథరావు,

Photo by Anant Desai



లష్కర్ బజారు,
హన్మకొండ.

తోడై వచ్చినది

బహుమతి
పొందిన వ్యాఖ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

రెండవ అట్ట:
మహాబలిపురం శిల్పాలు

మూడవ అట్ట:
సూర్యకాంతిపువ్వు

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


ఎక్కడ
లైఫ్‌బాయ్
వున్నదో అక్కడ
ఆరోగ్యం
వున్నది
LIFEBUOY
for health
లైఫ్‌బాయ్
మురికిలో గల సూక్ష్మ
క్రిములను కడిగివేస్తుంది
లింటాస్-L-61 77 TL
హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# ఇంకో ప్యారీ మిఠాయి తినాలని ఆశ !




పిల్లలు ప్యారీ మిఠాయిలు ఎప్పుడూ కావాలనే అంటూ వుంటారు. పిల్లలు అతివేగంగా కోల్పోయే శక్తిని ప్యారీ మిఠాయిలు భర్తీ చేస్తాయి. ప్యారీ మిఠాయిలు తాజాయైనవి, పుష్టికరమైనవి, చప్పరించకుండా వుండలేనంత రుచికరమైనవి.

తయారుచేయువారు: ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS-6396

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి





వివా త్రాగండి—వేడిగా లేక చల్లగా, నీళ్లలో లేక పాలలో మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో పుష్టివంతముగా చేయబడినదే వివా. అది స్నాయువులను బలపరుస్తుంది, నరములకు ఉపశమనమును కలిగిస్తుంది, కండరములకు సేదదీరుస్తుంది.

ప్రొద్దున్న వివా త్రాగితే రోజంతా ఉత్సాహముగా ఉంటారు!
రాత్రి వివా త్రాగితే గాఢముగా నిద్రపడుతుంది!
వివా సులభముగా జీర్ణమవుతుంది. అది రోగులకు, రోగము నుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సు చేయబడినది.

***రుచిగా ఉంటుంది కమ్మగా—***
***జీర్ణమవుతుంది త్వరగా***






Shilpi-JI-3C/71 TEL.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# మీ బాలుడు బలహీనంగా ఉన్నాడా?
# అతని ఆహారంలో పోషక శక్తి సరిగా లేదా?
# అతనికి సరిగా ఆకలి వేయదా?
# అయితే అతనికి ఫెరడాల్ ఇవ్వండి...

అతను ఎంత బలంగా, దిట్టంగా ఎదుగుతాడో పరిశీలించండి. పాలు, ఆహారధాన్యాలు, కూరగాయలు, పళ్లు మరియు గ్రుడ్లు వంటి స్వాభావిక ఆహారాలవల్ల లభించే మేలును, పోషణను మీ బిడ్డకు ఒక ఫెరడాల్ మాత్రమే సమకూర్చగలదు. ఎందువల్లనంటే, ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు ఫెరడాల్‌లో ఖచ్చితంగా సరియైన పాళ్లలో ఉన్నాయి. ఎముకలు దంతాలు దృఢంగా తయారవాలన్నా, కండరాలు బలంగా పెరగాలన్నా, పుష్టిగల రక్తం పట్టాలన్నా, శరీరంలో రోగనిరోధక శక్తి వృద్ధి పొందాలన్నా, కంటి చూపు కలకాలం బాగా ఉండాలన్నా, మీ బిడ్డ చురుకుగా ఆరోగ్యంగా ఎదగాలన్నా, ఫెరడాల్‌లో ఉన్న ఈ ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు మిక్కిలి అవసరం. ప్రతిరోజూ, ప్రొద్దున పూట రాత్రి పూట మీ బాలునికి ఫెరడాల్ ఇవ్వండి. పాలలో కలిపి అయినా సరే, దేనితోను కలపకుండా యథాతథంగా నైనా సరే తీసుకోవచ్చును. కుటుంబంలో అందరికీ ఫెరడాల్ మంచిదని గుర్తుంచుకోండి.






## ఫెరడాల్®

కమ్మని రుచి కలది
కుటుంబమంతకూ మంచిది

**పార్క్-డేవిస్** ఉత్పత్తి

® రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్. రిజిస్టర్డ్ యూజర్లు—పార్క్-డేవిస్ (ఇండియా) లి., బొంబాయి-72 ఎ్.

JAISONS 6

